Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు   స్థాపితం: 1930   జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 49 • 9-12-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





## కెవిపి మొగ్గెటో తేలిపోయింది!

వైఎస్ లేని కెవిపి రామచంద్రరావును వూహించుకోవడం కష్టం. వారిద్దరిదీ విడదీయలేని బంధం. చిన్ననాటి ప్రాణస్నేహితం. వైఎస్ అధికారంలో లేనప్పుడు కెవిపి అన్నీ వదులుకొని ఆయన వెన్నంటి తిరిగాడు. అధికారంలోకి వచ్చిన తర్వాత వైఎస్, అందరి మాటా కాదని కెవిపిని అందలం ఎక్కించాడు. ఒక జన్మంతా వూడిగం చేసినా వైఎస్ రుణం తీర్చుకోవడం కెవిపి తరం కాదు. కానీ వైఎస్ అటు దాటుకోగానే, కెవిపి ఇటు ప్లేట్ ఫిరాయించాడు. వైఎస్ కుటుంబాన్ని నడి సముద్రంలో వదిలేశాడు. కారణాలు ఏమైనా కావచ్చు. జగన్ కాంగ్రెస్‌లోనే కొనసాగేట్లు ఒప్పించడంలో తాను విఫలమైనప్పుడు, జగన్ ఎక్కడ వుంటే అక్కడ తాను వుండడం కెవిపి కనీస ధర్మం. కానీ దూరం దూరంగా మసలాడు. వారిద్దరి మధ్య సంబంధాలపై రాజకీయ వర్గాలలో అనుమానాలుండేవి. జగన్‌తో కెవిపి బంధం తెగలేదని, కాంగ్రెస్‌లో వుండి జగన్ అవసరాలను తీర్చడానికి ఆయన నాటకం ఆడుతున్నాడని ఒక వాదన విన్పించేది. ఇద్దరి మధ్య సంబంధాలు లేవని ఎవరైనా చెప్తే నమ్మడానికి ఎవరికీ మనసు

కొరవ 14వ పేజీలో

# అవిశ్వాస చదరంగంలో గెలిచిన జగన్!

అవిశ్వాసం ముచ్చట తీరిపోయింది. దాదాపు ఆరు నెలల నుంచి ఈ విషయంలో చంద్రబాబుకు రోజుకొక సవాలు విసురుతూ, చీకాకు పెడుతుండినాడు వైఎస్.జగన్. కాంగ్రెస్‌తో కుమ్మక్కయ్యావని నిందల మీద నిందలు వేస్తూ వచ్చాడు. నీకు దమ్ము లేదని ఎగతాళి చేశాడు. జగన్ ఉద్దేశం, చంద్రబాబు అవిశ్వాస తీర్మానం ప్రవేశపెడితే, తన వద్ద వున్న ఎమ్మెల్యేల చేత తిరుగుబాటు చేయించి, కిరణ్ సర్కారును కూలదోసి, త్వరగా ఎన్నికలు రప్పించి, త్వరత్వరగా తాను ముఖ్యమంత్రి పీఠం మీద కూర్చోవాలని. ఎన్నికలంటూ జరిగితే, గెలుపు తనదే అన్న విశ్వాసం జగన్‌లో దట్టంగా వుంది. చంద్రబాబు అభిప్రాయం కూడా అదే. ఇప్పటికిప్పుడు ఎన్నికలు వస్తే, జనం జగన్ పక్షమే వహిస్తారన్న భయంతో ఆయన అవిశ్వాసం జోలికి వెళ్లలేదు.

ఈ ఆరునెలల్లో పరిస్థితులు మారాయి. మొదట మొదట అత్యంత బలహీన ముఖ్యమంత్రిగా భ్రష్టుపడుతూ వచ్చిన కిరణ్‌కుమార్ రెడ్డి పదవిలో కుదురుకొన్నాడు. సిబిఐ కేసుల పరంపరతో జగన్ మీద ఎమ్మెల్యేలలో నమ్మకం సడలింది. ఆయన జైలుకు వెళ్లడం ఖాయమని, అదే జరిగితే ఇప్పుడు ఆయన్ను ఆరాధిస్తున్న జనం మనసు మార్చుకొనే అవకాశం వుందని, మరొకప్రక్క సిబిఐ ఆయన్ను అష్టదిగ్బంధనం చేస్తున్నది కాబట్టి, ఎన్నికలకు అవసరమైన నిధులు సమీకరించలేక పోవచ్చునని ఎమ్మెల్యేలు ఆలోచన చేశారు. దానితో జగన్ బలం రోజు రోజుకూ తగ్గుతూ వచ్చింది.

ఆ అదును చూసుకొనే దెబ్బ కొట్టాలని చూశాడు చంద్రబాబు. ఇప్పుడు అవిశ్వాసం పెడితే, జగన్ వద్ద ఎమ్మెల్యేలు లేరు కాబట్టి, తాను కిరణ్‌తో కుమ్మక్కు కాలేదన్న నింద తొలగిపోతుంది. అదే సమయంలో ప్రభుత్వమూ క్షేమంగా బయటపడుతుంది. స్వామి కార్యం స్వకార్యం నెరవేరుతుంది అన్న ధీమాతో అవిశ్వాసం ప్రవేశపెట్టాడు చంద్రబాబు.

పైకి చూడడానికి ఈ రాజకీయ డ్రామాలో చంద్రబాబు, కిరణ్‌కుమార్‌రెడ్డి పైచెయ్యి సాధించినట్లు కన్పిస్తుందన్న మాట నిజం. కానీ కొంచెం తరచి చూస్తే మాత్రం, వారిద్దరూ గెలిచి ఓడితే, జగన్ మాత్రం ఓడి గెలిచాడన్న భావం బలపడుతున్నది. ఆరునెలల క్రితం అవిశ్వాసం పెట్టి వుంటే ఎట్లా వుండేదో చెప్పలేము. అప్పటికి జగన్ వద్ద దాదాపు 50 మంది వరకు ఎమ్మెల్యేలు వున్నారని చెప్పేవారు. అప్పటికి ప్రజా రాజ్యం కాంగ్రెస్‌లో విలీనం కాలేదు. టిఆర్ఎస్ చాలా జోరు మీద వున్నది. తెలంగాణ ఉద్యమం వూపు జంజామారుతం



వలె వీస్తున్నది. దాదాపు 100 మంది తెలంగాణ ఎమ్మెల్యేల రాజీనామాలు స్పీకర్ వద్ద పెండింగ్‌లో వుండినాయి. ఆ దశలో అవిశ్వాసం పెట్టి వుంటే ఏమైనా జరిగే అవకాశం వుంది. కానీ ఇప్పుడు పరిస్థితులు పూర్తిగా మారి పోవడంతో జగన్ కేవలం 18 మంది ఎమ్మెల్యేల మద్దతుతో ప్రభుత్వాన్ని ఏమీ చేయలేక చతికిలపడ్డాడు. అయితే ఒక వ్యక్తి కోసం 18 మంది ఎమ్మెల్యేలు తమ పదవులు వదలు

కొరవ 14వ పేజీలో

## కార్టూన్ స్కేప్



రైతు ప్రభుత్వాన్ని అభినందించడానికొచ్చాడట సార్!

## శ్రీలక్ష్మితో సిబిఐ పరువు పోయింది!

రాష్ట్రంలో ఈ రోజు జనం ఎక్కువగా మాట్లాడుకొనే మాట – సిబిఐ. గాలి జనార్దనరెడ్డి కేసుతో దాని వున్నతాధికారి లక్ష్మీనారాయణ కీర్తి కొండెక్కింది. జగన్ అక్రమ ఆస్తుల కేసును శోధిస్తున్న తీరు కూడా జనానికి నచ్చుతున్నది. పలుకుబడులకు, ప్రలోభాలకు, మొగమాటాలకు, మేరమెచ్చులకు ఏ మాత్రం లొంగని అరుదైన అధికారిగా ఆయనకు జనంలో గుర్తింపు లభించింది. అవినీతి నిరోధ కేసులలో అసలు నిందితులు, వారెంత పెద్ద వారైనా సిబిఐ ఉచ్చు తప్పించుకోలేరన్న విశ్వాసం ఏర్పడింది.

కానీ ఐఎఎస్ అధికారిణి శ్రీలక్ష్మి విషయంలో ఇదే సిబిఐ అనుసరించిన పోకడతో శిఖరం మీద నుంచి బండరాయి దొర్లినట్లుగా సిబిఐ పట్ల నమ్మకం దిగజారి పోతున్నది. గాలి గనుల కేసులో శ్రీలక్ష్మి పాత్ర, ప్రమేయం పట్ల ఎవరికీ ఎటువంటి అనుమానాలూ లేవు. ఆనాటి ప్రభుత్వాధినేతల అడుగులకు మడుగులొత్తడం ద్వారా ఆమె ఆర్జించిన అక్రమ సొత్తు వందల కోట్లలో వుంటుందని తోటి ఐఎఎస్ అధికారులే కథలు కథలుగా చెప్పుకున్నారు. తన చెయ్యి తడిపితే చాలు, తెల్ల కాగితం మీద కూడా నిర్భయంగా సంతకం చేయడంలో సిద్ధహస్తురాలనే పేరు వుంది. ఒక్క గాలి జనార్దనరెడ్డి మాత్రమే కాదు, రాష్ట్రంలో కొన్ని వందల గనుల ఫైళ్లను ఆమె అట్లానే తన స్వలాభానికి వాడుకొన్నాదన్నది బహిరంగ రహస్యం. గనుల శాఖకు రావడం కోసం, తానైతే అధికారంలో వున్నవారు కోరే గొం

కొరవ 14వ పేజీలో

# లోక్‌పాల్‌కు మోక్షం

అన్నా హజారే దీక్ష ఫలితంగా మొలకెత్తిన లోక్‌పాల్ బిల్లు పార్లమెంట్ ముందుకు వచ్చింది. ఇందుకోసం ఏర్పాటైన పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీ తన సిఫార్సులను సమర్పించింది. అయితే స్టాండింగ్ కమిటీ సభ్యుల మధ్య చాలా వివాదాస్పద అంశాలలో ఏకాభి ప్రాయం కుదరలేదు. అందులో ప్రధానమైనది ప్రధాన మంత్రిని లోక్‌పాల్ పరిధిలో చేర్చడం. అన్నా హజారే బృందం మొదట నుంచి గట్టిగా పట్టుబడుతున్న అంశం ఇది. కాంగ్రెస్ సభ్యులు ప్రధానిని ఇందులోకి లాగడం దేశ రక్షణను ప్రమాదంలోకి నెట్టడంగా భావిస్తున్నారు. అయితే బిజెపి మాత్రం, దేశ రక్షణ, అణు వ్యవహారాలు, విదేశాంగ విధానం వంటి కీలక అంశాలను మినహాయించి తతిమా వ్యవహారాలలో ప్రధానిని విచారించే అధికారం లోక్‌పాల్‌కు ఇవ్వాలని పట్టుబడుతున్నారు. వామపక్షాలు కూడా ఇదే అభిప్రాయం వ్యక్తం చేశాయి. దానితో పార్లమెంటరీ స్థాయి సంఘం ఎటూ తేల్చకుండా పార్లమెంట్ విజ్ఞతకే ఈ అంశాన్ని వదలి పెడుతున్నట్లు ప్రకటించింది. విచిత్రంగా అన్నా హజారే సైతం ఈ భావనతో ఏకీభవిస్తున్నారు. ప్రధానిని చేర్చకుంటే మళ్లీ దీక్షలో కూర్చుంటానని బెదరిస్తూ వచ్చిన ఆయన, పార్లమెంట్ ఔన్నత్యాన్ని తానూ గౌరవిస్తానని ప్రకటించి, సమస్యకు సానుకూల పరిష్కార మార్గాన్ని సుగమం చేశాడు. అభినందనీయమైన వైఖరి ఇది.

అయితే లోక్‌పాల్ పరిధిలోకి న్యాయవ్యవస్థను, మరీ ముఖ్యంగా సుప్రీంకోర్టు జడ్జీలను తీసుకొని రావాలని అన్నా బృందంలోని ముఖ్యులు కొందరు చేసిన వాదనను అన్ని రాజకీయ పార్టీలూ ఏకాభిప్రాయంతో తోసిపుచ్చాయి. దాని వల్ల న్యాయవ్యవస్థ స్వేఛ్ఛా, స్వాతంత్ర్యాలు హరించుకొని పోతాయన్నది అందరి భావన. బహుశా అన్నా హజారే ఈ విషయంలో పట్టుబట్టక పోవచ్చు.

సాధారణ ప్రభుత్వ ఉద్యోగులను కూడా లోక్‌పాల్ విచారణకు అర్హం చేయాలని కొందరు కాంగ్రెస్ సభ్యులు స్టాండింగ్ కమిటీలో డీసెంట్ నోట్ సమర్పించారు. మొత్తం మీద 16 డీసెంట్ నోట్‌లతో పార్లమెంట్ ముందుకు చర్చకు రాబోతున్నది ఈ బిల్లు.

సభ్యుల మధ్య, అన్నా హజారేకు ప్రభుత్వానికి మధ్య కొన్ని భేదాభిప్రాయాలున్నప్పటికీ లోక్‌పాల్ బిల్లును సత్వరం ఆమోదింప చేయవలసిన అవసరం ఎంతైనా వుంది. గాలి జనార్ధనరెడ్డి, ఎమ్మార్ వంటి కుంభకోణాలలో ఐఎఎస్ అధికారులు చట్టాల అడ్డంకులు చూపి సిబిఐ చేతులు కట్టి పడేస్తున్న తీరు చూసిన తర్వాత ఈ అవసరం ఎంతగా వుందో చెప్పకనే అర్ధమౌతున్నది. ఐఎఎస్, ఐపిఎస్ అధికారులు తామే తయారు చేసుకున్న చట్టాలలో తమ రక్షణకు సకల ఏర్పాట్లూ చేసుకొన్నారు. తాము చట్టాలకు అతీతమన్నట్లు ప్రవర్తిస్తున్నారు. నిజం మాట్లాడుకోవాలంటే ఈ దేశంలో రాజకీయ అవినీతికి రాజకీయవాదుల కంటే కూడా ఐఎఎస్ అధికారులే ప్రధాన కారకులు. తమ పైనుండే మంత్రులు చేసే అక్రమాలను వంత పాడడంలోనే కాదు, వారికంటే అధికంగా అక్రమార్జన చేయడంలో కూడా ఐఎఎస్‌లు అదుపు తప్పి పోతున్నారు. దేశ ఖజానా మీద పంది కొక్కుల వలె పడి పిప్పి చేస్తున్నారు. ఇటువంటి దుర్మార్గాలు నియంత్రించాలంటే లోక్‌పాల్ బిల్లు తక్షణం ఆచరణకు రాక తప్పదు.

అయితే ఆ బిల్లును నిర్వీర్యం చేయడానికి, కోరలు లేని పాము వలె మార్చడానికి పార్లమెంట్ సభ్యులు ప్రయత్నం చేస్తారనడం నిజం. ఈ విషయంలో ప్రజలందరూ అప్రమత్తంగా వుండక తప్పదు. పార్లమెంట్‌లో దానిపై చర్చ జరిగినన్ని రోజులు అన్నా హజారే ఢిల్లీ వీధులలో జన సమీకరణ చేసి, పార్లమెంట్ సభ్యుల మీద ఒత్తిడి తేవడం అవసరం. ప్రజా స్వామ్యంలో పార్లమెంట్ స్వేచ్ఛగా, స్వతంత్రంగా, ఒత్తిడులకు లోను కాకుండా నడవాలన్నది సత్సాంప్రదాయమే అయినప్పటికీ, లోక్‌పాల్ బిల్లు విషయంలో ప్రజలు నేరుగా వారిని ఒత్తిడి చేయక తప్పదు. రాజకీయ అవినీతిలో పార్లమెంట్ సభ్యులకు, కేంద్ర మంత్రులకు కీలక వాటా వుంది. ఆ నరమాంసం రుచి మరిగిన పులులు అంత సులభంగా తమ నోటి దగ్గర కూడు వదలుకోవడానికి సిద్ధపడవు. వారిని అదమాయించి, గదమాయించి అయినా బిల్లును సక్రమ రూపంలో ఆమోదింప చేసుకోవడం ప్రజల బాధ్యత. ఈ విషయంలో ప్రతిపక్షాలను సైతం నమ్మే పరిస్థితి లేదు. ఆ పీలిక కూడా ఆ తానులోనిదే కదా?



## జనవాణి

### అందరూ వ్యతిరేకించాలి!

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చి 64ఏళ్లయినా మన వ్యాపార రంగాలకు విదేశీపెట్టుబడుల అవసరం పెరుగుతుండడం విచారకరం. విదేశీపెట్టుబడులను ఎక్కడ ఉపయోగించుకోవాలో కూడా ఆలోచించకుండా మన ప్రభుత్వం చిల్లర వ్యాపార రంగంలోనికి అనుమతించడం సముచితం కాదు. ప్రతిపక్షాలు ఏక కంఠంతో కేంద్ర నిర్ణయాన్ని వ్యతిరేకించడం హర్షదాయకం. మన దేశాన్ని విదేశీ వ్యాపార వర్గాలకు తాకట్టు పెట్టే ప్రభుత్వ విధానాన్ని పార్లమెంటు సభ్యులే కాకుండా శాసనసభ్యులు, వ్యాపార సంస్థలు కూడా వ్యతిరేకించాలి.

*జె.సత్యనారాయణ* — *నెల్లూరు*

### రైతులను ఆదుకోవాలి!

విపరీతంగా పెరిగిపోతున్న విత్తనాల రేట్లతో వ్యవసాయం లాభసాటిగా లేక రైతులు ఇబ్బందులు పడుతున్నారు. విత్తన కంపెనీలు మాత్రం ఇవేమి పట్టనట్లు విత్తనాల రేట్లను పెంచేసి దోచుకొంటున్నాయి. పెరిగిన ఎరువుల ధరలు, కూలీ రేట్లు, నకిలీ విత్తనాలు రైతును అప్పులపాలు చేస్తున్నాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు విత్తన కంపెనీల ఆగడాలను అరికట్టి రైతులను ఆదుకోవాల్సిన అవసరం ఎంతైనా వుంది.

*దంపూరు వెంకటరమణయ్య* — *పార్లపల్లి*

### బిసిలేం పాపం చేశారు?

రాష్ట్రప్రభుత్వం బిసి ఉద్యోగ నియామకాల్లో క్రిమీలేయర్ నిబంధన విధించాలని నిర్ణయం తీసుకోవడం బాధాకరం. ఎస్సీ, ఎస్టీ కోటాల్లో క్రిమీలేయర్ విధానాన్ని పాటించకుండా ఒక్క బిసిలకు విధించడం ఎంతవరకు న్యాయం. బిసిల్లో కొన్ని కులాలు అభివృద్ధి చెందవచ్చు. కాని వడ్డెర, వాల్మీకి, చాకలి, మంగలి, బుడబుక్కల, గంగిరెద్దులవాండ్లు, మేదర, కుమ్మర, కురుమ తదితర 40 కులాల వారికి ఇప్పటికీ సమాజంలో గౌరవం లేదు. స్వాతంత్ర్యం వచ్చి 64ఏళ్ల తర్వాత ఈ కులం నుంచి ఒక్క ఐఎఎస్, ఐపిఎస్ ఆఫీసర్ రాలేదు. ప్రజాస్వామ్యమంటే తెలియనివారు, సంఘసేవకు అర్థం తెలియనివారు పార్లమెంటరీ వ్యవస్థలో పెత్తనం చేస్తున్నందున ఇటువంటి నిర్ణయాలు వెలువడుతున్నాయి.

*రేపూరు ఆదినారాయణ* — *వెంకటగిరి*

### సత్సంబంధాలేవీ?

మన ప్రధాని మన్మోహన్‌సింగ్ ఇటీవల చైనా ప్రధానిని కలిశారు. ఇరు దేశాల మధ్య సత్సంబంధాలు వున్నాయని ప్రకటించారు. కాని ఇరుదేశాల మధ్య వున్న అరుణాచల్‌ప్రదేశ్‌ను ప్రపంచపటంలో చైనా అధీనంలో చూపడం, భారత్ సరిహద్దు వెంట సైన్యం సంఖ్య పెంచడం మొదలైన ప్రధాన విషయాలు వదలి కేవలం కరచాలనాలతో సరిపెట్టడం బాధాకరం.

*పి.అరుణకుమారి* — *నెల్లూరు*

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**12-12-1941**
**పేజీలు : 10 వెల: అణా**

### సత్యాగ్రహము

యిందుపూరు కాపురస్తుడు కొనగళ్ల శేషాచలం శెట్టి గారు కావలిలో 6-12-41 సాయంకాలం సత్యాగ్రహం చేసిరి. పోలీసు వార్ని అరెస్ట్‌చేసి రాత్రి 8 గంటలకు వదలివేసి, తిరుగా 8-12-41 అరెస్టు చేసిరి. 8న కేసు ఏమీలేదని డిప్టీ మేజిస్ట్రేటు వారు వదలివేసిరి.

### నెల్లూరు జిల్లా రాజకీయ సభలు

1942 సంవత్సరం జనవరి రెండవ వారంలో నెల్లూరు జిల్లా రాజకీయ సభలు వెంకటగిరిలో జరుగును.

### క్రొత్తహాలు సినిమా

10-12-41 నుంచి క్రొత్తహాలులో సినిమా ప్రారంభమైనది. హిందువులు ఎవరూ ప్రదర్శనలకు పోలేదని వార్త.

### ఉత్సవము నిషేధము

నెల్లూరు మున్సిపల్ సరిహద్దు లోపల మేళములుగానీ యేలాంటి ఉత్సవములు గానీ జరుగకూడదని జిల్లా మేజిస్ట్రేటు గారు ఇచ్చిన 144 సెక్షన్ ఆర్డరు 16-12-41 తేది మొదలు యింక రెండు నెలలు అమలులో ఉండవలసినట్లు మదరాసు గవర్నమెంటు వారు ప్రచురించిరి.

### ఇందుకూరుపేట డాక్టరు

సార్! తాము రావడం కొత్త. అప్పుడే ఏమేమో కంప్లెయింట్లా? అబ్బే! బాగులేదు. సర్దుకోండి.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**8-12-1961**
**పేజీలు: 12 వెల: 0-20 న.పై**

### నెల్లూరు ముచ్చట్లు

### విద్యుచ్ఛక్తి : నెల్లూరుకు అన్యాయం

రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు వారు ఈ సంవత్సరానికి 128 విద్యుచ్ఛక్తి విస్తరణ పథకాలు రు.4కోట్ల 70 లక్షల ఖర్చుతో గూడిన వాటిని మంజూరు చేశారు. ఆంధ్ర జిల్లాలకు 270 లక్షలు, తెలంగాణకు 200 లక్షలు ఖర్చయ్యే పథకాలు అన్నో యిన్నో ఈ వార్షిక కార్యక్రమంలో మంజూరయ్యాయి కానీ వ్రేలుపెట్టి చూపినట్లుగా నెల్లూరుజిల్లాకు చెందిన ఒక్క పథకం గూడా ఈ కార్యక్రమంలో చేరలేదు. ఇది అత్యంత శోచనీయం. ఈ జిల్లా యెడ ఈ విధమైన పక్షపాతం చూపవలసివచ్చిన పరిస్థితులేమిటో తెలియదు.

ఈ అన్యాయాన్ని గూర్చి శాసనసభ్యులెవ్వరూ శాసనసభలో గూడా ప్రస్తావించలేదు. ఇప్పుడైనా వీరు నెల్లూరు జిల్లా పట్ల చూపబడిన ఈ పక్షపాతాన్ని ప్రభుత్వం దృష్టికి తెచ్చి, అన్ని జిల్లాలతోపాటు నెల్లూరు జిల్లాకు కూడా విద్యుచ్ఛక్తి పథకాలు మంజూరగుటకు కృషి చేయవలసిందిగా ప్రజాప్రతినిధులను కోరుతున్నాము.

### భూ పంపకం

నెల్లూరు తాలుకా బండేపల్లి, నిడిగుంటపాళెం, ఇస్కపాళెం, వర్లపాడు, సర్వేపల్లి గ్రామాలలో 71 మంది భూములులేని పేదలకు 104 ఎకరాల బంజరు భూములు, జాయింట్ కలెక్టర్ ఎస్.ఆర్.శంకరన్ గారిచే పంచబడినది.

# నెల్లూరు ముచ్చట్లు

## మేకపాటి చంద్రమోహన్‌రెడ్డి?

పై శీర్షిక పొరపాటుగా వ్రాసి నట్లుగా పాఠకులు భావిస్తారోమో... కానీ వాస్తవం. 5వ తేది అసెంబ్లీలో తెలుగు దేశం పార్టీ ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి ప్రభుత్వంపై అవిశ్వాసతీర్మానం ప్రవేశపెట్టిన సందర్భంగా ఓటింగ్ జరి గింది. ఈ సందర్భంగా జగన్ వర్గం వైపు నిలబడ్డ ఉదయగిరి శాసనసభ్యుడు మేక పాటి చంద్రశేఖర్‌రెడ్డి పేరును టివి-9 ప్రత్యక్ష ప్రసారంలో అవుట్‌పుట్ ఎడిటర్ రజనీకాంత్ తరచూ మేకపాటి చంద్ర మోహన్‌రెడ్డి అని పలికారు. నిద్ర మత్తు వల్ల కాబోలు ఈ వ్యవహారం అయ్యేంత వరకు మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డిని చంద్ర మోహన్‌రెడ్డిగానే పలవరిస్తూనే ఉండినా రాయన.

## మారిషన్‌కు ఆర్థిక మంత్రి!

ఆర్థిక మంత్రి ఆనం రామనారా యణరెడ్డి 7వ తేది హైదరాబాద్ నుంచి మారిషన్ పర్యటనకు బయలుదేరి వెళ్లారు. 8, 9, 10 తేదీల్లో ఇక్కడ జరిగే ప్రపంచ తెలుగు మహాసభల్లో ముఖ్య అతిథిగా ఆయన పాల్గొంటారు.

## మంచి నిర్ణయం

బారాషహీద్ దర్గా దగ్గర రొట్టెల పండుగను పురస్కరించుకొని పోలీసా ఫీసు నుంచి దర్గా ముఖ ద్వారం వరకు గతంలో రెండు వైపులా అంగళ్లను ఏర్పాటు చేసేవారు. దీనివల్ల దర్గాకు వచ్చే భక్తులకు అడుగుతీసి అడుగువేయ లేని పరిస్థితి నెలకొనేది. గుంటూరు రేంజ్ ఐజి హరీష్‌కుమార్ గుప్తా ఈ వ్యవ హారం బాగా గమనించినట్లుంది. ఈ యేడాది రోడ్డుకు ఇరు ప్రక్కల దుకా ణాల ఏర్పాటుకు ససేమిరా అన్నారు. దీంతో భక్తులు త్వరితగతిన దర్గాతో పాటు రొట్టెలను వదలను చెరువు దగ్గ రకు వెళ్లను మార్గం సుగమం అయ్యింది.

## తిరుగుతూనే ఉండిన వివేకా!

ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డిపై తెలుగుదేశం పార్టీ అసెంబ్లీలో అవిశ్వాస తీర్మానం ప్రవేశపెట్టిన సందర్భంలో సీటులో కుదురుగా కూర్చోక అటూ ఇటూ తిరుగుతూ నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి టీవీ ప్రత్యక్ష ప్రసారాల్లో తెగ కన్పించారు. టీవీల్లో కని పించనే ఆయన అటు ఇటూ తిరుగు తున్నట్లనిపించింది.

## వైఎస్‌ను సమర్థించిన ఆనం!

5వ తేది అర్థరాత్రి అసెంబ్లీలో ప్రభుత్వంపై అవిశ్వాస తీర్మానంలో భాగంగా జరిగిన చర్చలో తెలుగుదేశం సీనియర్ నాయకుడు మోత్కుపల్లి నరసిం హులు మాట్లాడుతూ మాజీ ముఖ్య మంత్రి వైఎస్ రాజశేఖర్‌రెడ్డిని తులనా డారు. ఈ సందర్భంగా చర్చలో జోక్యం చేసుకొన్న ఆర్థిక మంత్రి ఆనం రామ నారాయణరెడ్డి రెండేళ్ల క్రితం చనిపోయి ఇప్పుడు సభ్యులు లేవనెత్తే ప్రశ్నలకు జవాబు చెప్పలేని వైఎస్ పేరును సభలో ప్రస్తావించడం సబబు కాదన్నారు. ఆనాడు వైఎస్ తీసుకొన్న ఎన్నో నిర్ణ యాలు ప్రజలకు మేలు చేసేవేనని రామ నారాయణరెడ్డి ఆయన్ను వెనకేసుక రావ డం చాలా మందిని ఆశ్చర్యపరచింది.

## ముందుగా ప్రారంభమైన రొట్టెల పండుగ!

నెల్లూరుకు రొట్టెల పండుగ కళ వచ్చింది. వాస్తవానికి రొట్టెల పండుగను దర్గా వద్ద గంధ మహోత్సవం జరిగే మరుసటి రోజు అంటే 8వ తేది మొదలుపెట్టాలి. కానీ మొహరం నెలలో తొమ్మిదవ రోజు (5వ తేది) నుంచే రొట్టెలు పట్టడం, విడిచే వారితో దర్గా పరిసర ప్రాంతాల్లో సందడి నెలకొంది. ప్రారంభమైన తేదీ నుంచి లెక్కిస్తే ఈ సారి రొట్టెల పండుగ ఆరు రోజులు జరి గిందనక తప్పదు.

## కార్పొరేషన్‌లో క్యాంటిన్!

నెల్లూరు కార్పొరేషన్ కార్యాలయ ప్రాంగణంలో క్యాంటిన్ లేకపోవడంతో సిబ్బంది టీ, కాఫీ తాగను లేదా తెప్పించుకోను ఇటు పోలీసు ఆఫీసు అటు పొదలకూరు రోడ్డు సెంటర్‌కు పోవాల్సి వస్తుంది. కార్యాలయానికి పని బడి వచ్చే ప్రజల తిప్పలు వర్ణనాతీతం. వీటిని తప్పించేందుకు 14 లక్షల రూపా యలు వెచ్చించి నిర్మించే క్యాంటిన్ త్వరి తగతిన చేయిస్తానంటున్నాడు కమిషనర్ డాక్టర్ పిఎస్ఆర్ ఆంజనేయులు.

### చందాదారులకు మనవి

- చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.
- 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Onlineలో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.
- చెక్కులు స్వీకరించబడవు.

**జీవిత చందా రూ.1000/-**

**సంవత్సర చందా**

స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190

## రసరాజుకు నాగభైరవ అవార్డు!

ప్రముఖ కవి నాగభైరవ కోటేశ్వర రావు స్మారకంగా ఇచ్చే అవార్డుకు ఈ యేడాది ప్రముఖ కవి రసరాజును ఎం పిక చేసినట్లు డాక్టర్ నాగభైరవ అవార్డు కమిటీ కార్యదర్శి సి.నారాయణరావు చెప్పారు. 11వ తేది నెల్లూరు టౌన్ హాల్‌లో జరిగే ఈ అవార్డు ప్రదానోత్సవ కార్యక్రమంలో సినీ రచయిత వెన్నెల కంటి, ఎఎస్పీ నాగేశ్వరరావు, ఎస్‌బిఐ రీజనల్ మేనేజర్ కామేశ్వరరావు, మురళీ కృష్ణ హోటల్స్ అధినేత వీరిశెట్టి హజరత్ బాబు, కె.వి.చలమయ్య తదితరులు పాల్గొంటారు. నాగభైరవ కోటేశ్వరరావుపై సమగ్ర సాహిత్య సంపుటాలు 'నాగభైరవం'ను తులసి చంద్రశేఖర్ ఆవిష్కరిస్తారు. ఈ సందర్భంగా ఉదయం 11 గంటలకు బొగ్గవరపు రాధాకృష్ణమూర్తి నేతృత్వంలో కవి సమ్మేళనం కూడా జరుగుతుందని నిర్వాహకులు తెలిపారు.



హైదరాబాద్‌లోని ఉస్మానియా యూనివర్శిటీలో మెకానికల్ ఇంజనీరింగ్ విభాగంలో నాలుగేళ్లు టాపర్‌గా నిలచిన నెల్లూరు విద్యార్థి ఆకుల విజయకుమార్‌కు బంగారు పతకం బహుకరిస్తున్న రాష్ట్ర ఉన్నత విద్యామండలి ఛైర్మన్ ప్రొఫెసర్ జయప్రకాశరావు.

## ఆటోవాలాలపై నిఘా

నెల్లూరులో ఆటోలు నడిపే వారిలో సంఘ విద్రోహశక్తులున్నారు. దీంతో ఆటోల్లో డబ్బులు కొట్టేయడం, ఒంట రిగా ఆటో ఎక్కిన మహిళ లను నగర శివారు ప్రాంతా లకు తీసుకెళ్లి దోపిడీ చేయ డం రివాజుగా మారింది. ఆటోవాలాలపై నిఘాను పెంచే చర్యల్లో భాగంగా పోలీసులు ప్రతి ఆటోపై విధిగా దాని యజమాని ఫోటో, సెల్‌నెంబరు, చిరు నామా ఉండేలా చర్యలు ప్రారంభించారు. నగరంలో పదివేల ఆటోలు తిరుగుతు న్నాయని అంచనా. మూడు నెలల లోపల ఈ వివరాలు ప్రదర్శితమయ్యేలా ట్రాఫిక్ పోలీసులు చర్యలు తీసుకొ న్నారు. ఈ నిర్ణయం మూలంగా జనానికి మంచి జరుగు తుందని విశ్వసిద్దాం.

## మాగుంట సుబ్బరామిరెడ్డి వర్థంతి

ఒంగోలు మాజీ పార్ల మెంటు సభ్యులు మాగుంట సుబ్బరామరెడ్డి 16వ వర్థంతి వేడుకలు డిశంబర్ 1వ తేది నెల్లూరులోని ఆయన విగ్ర హం వద్ద జరిగాయి. పిసిసి కార్యదర్శి ఉడతా వెంకట్రావ్, జడ్పీ మాజీ ఛైర్మన్ చెంచల బాబు, రఘురామ్ ముది రాజ్, బాలసుధాకర్, తాటి పర్తి మల్లిఖార్జున తదిత రులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. అనంతరం రంగనాయకుల పేటలోని వారి కళ్యాణ మండపంలో అన్నదాన కార్యక్రమం నిర్వ హించారు.

## సిద్ధ సమాధి యోగ శిక్షణా తరగతులు

సిద్ధ సమాధి యోగ పరిచయ కార్యక్రమం 11వ తేది ఉదయం 10 గంటలకు గాంధీనగర్‌లోని సాయిబాబా మందిరం, సాయంత్రం ఆరు గంటలకు మూలపేటలోని వేణుగోపాలస్వామి దేవ స్థానంలో జరుగుతుందని ఆచార్య శ్రీని వాస్‌జీ చెప్పారు. ఈ పరిచయం తర్వాత 15 రోజులపాటు సిద్ధ సమాధి యోగ శిక్షణా తరగతులు జరుగుతాయి. వివరా లను 80085 47957 నెంబరుకు ఫోన్ చేసి తెలుసుకోవచ్చు.

## ఫిజిక్స్ అవగాహన సదస్సు

విశ్వసాయి విద్యాసంస్థ టౌన్ హాల్‌లో నిర్వహించిన ఫిజిక్స్ అవగా హన సదస్సుకు విద్యార్థులు, వారి తల్లి తండ్రుల నుంచి విశేష స్పందన లభిం చింది. సంస్థ అకడమిక్ డైరక్టర్ కోరా మాస్టర్ ఈ సదస్సులో మాట్లాడుతూ ఫిజిక్స్‌లోని ఎలక్ట్రిసిటీ అండ్ మాగ్న టిజం, మోడ్రన్ ఫిజిక్స్, ఎలక్ట్రోస్టాటిస్టిక్స్, కరెంట్ ఎలక్ట్రిసిటీ, ఎలక్ట్రోమాగ్నటిక్ ఇండక్షన్ వంటి టాపిక్స్‌పై దృష్టి పెడితే ఏ టెస్టులలోనైనా విజయం సాధించ

కొరవ 14వ పేజీలో



కొండాయపాళెం గేటు వద్ద గల హాస్టల్‌లో దుస్థితిలో వున్న గది.

# సంక్షేమంలో క్షామం

## దుస్థితిలో వసతి గృహాలు

ఉన్నతాధికారులు ఎన్ని చర్యలు చేపట్టినా, ఎన్ని హెచ్చరికలు చేసినా సంక్షేమ వసతి గృహాల్లో ఉండే పిల్లల పరిస్థితి దయనీయంగా ఉంటోంది. కనీస సౌకర్యాలకు నోచుకోని విద్యార్థులు కటిక నేలపై, ఇరుకు గదుల్లో, ఎప్పుడు శ్లాబ్ పెచ్చులూడి పడుతుందోనన్న భయాందోళనల నడుమ బిక్కుబిక్కుమంటూ కాలం వెళ్లదీయాల్సి వస్తోంది. కనీసం శీతాకాలంలో చలి నుంచి రక్షణ పొందేందుకు తగిన దుప్పట్లు అందక చలికి గడగడ వణికి పోవాల్సి రావడం హాస్టళ్లలో డొల్లతనాన్ని బట్టబయలు చేస్తోంది. సంక్షేమ వసతి గృహ అధికారులకు విద్యార్థులు పడే అవస్థలు కనిపించవు. ఎన్‌రోల్‌మెంట్‌లో చేతివాటం చూపి వచ్చిన సొమ్మును తిలాపాపం తలా పిడికెడు అన్న చందంగా పంచుకోవడం తప్ప విద్యార్థుల సంక్షేమం పట్టించుకోవడం లేదు. గతంలో ప్రజాప్రతినిధులు సంక్షేమ బాట పట్టినప్పటికీ రెండేళ్లుగా వాటివైపు తొంగి కూడా చూడడం లేదు. జిల్లాలో ఎస్సీ, ఎస్టీ, బిసి విద్యార్థుల కోసం 260 హాస్టళ్లను ఏర్పాటు చేశారు. దాదాపు 28వేల మంది పిల్లలు ఇక్కడ వుంటూ చదువుకుంటున్నారు. శిథిలమైపోయిన భవనాలు, మరుగుదొడ్లు లేక, పడుకొనేందుకు తగిన వసతి లేని హాస్టళ్లు అధికంగా ఉన్నాయి. విద్యార్థి సంఘాలు పలు మార్లు ఆందోళన చేపట్టినా హాస్టల్ సిబ్బందిలో మార్పు రావడంలేదు. దీనికితోడు గతంలో ప్రజాప్రతినిధులు, అధికారులు రాత్రివేళ హాస్టళ్లలో బసచేసి సమస్యలు తెలుసుకొని ప్రభుత్వానికి నివేదించినా అందుకు కోట్లాది రూపాయలు కావాల్సి రావడంతో ప్రభుత్వం సంక్షేమ బాటను అటకెక్కించింది. జిల్లా కలెక్టర్ శ్రీధర్ స్వీకారం పథకానికి శ్రీకారం చుట్టినా హాస్టల్ రూపురేఖలు మారడానికి ఇంకా చాలా సమయమే పట్టేలా ఉండడంతో పిల్లలు తీవ్ర ఇబ్బందులకు గురౌతున్నారు.

# బోగస్ కార్డులపై చర్యలు!

ప్రజాపంపిణీ వ్యవస్థను మరింత మెరుగు పరచాలని ప్రభుత్వం నిర్ణయించింది. ప్రస్తుతం రూపాయికే కిలో బియ్యం పథకాన్ని అమలు చేయడంతోపాటు బోగస్ కార్డులు కలిగి ఉన్న వారిపై చర్యలు తీసుకోవాలని పౌరసరఫరాల శాఖకు ఆదేశాలందాయి. గతంలో బోగస్ కార్డుల ఏరివేతలో భాగంగా లక్షకుపైగా కార్డులు స్వాధీనం చేసుకుని వాటిని రద్దుచేయడం జరిగింది. ప్రభుత్వ లెక్కల ప్రకారం దారిద్ర్యరేఖకు దిగువనున్న సంఖ్యకంటే అదనంగా తెల్లకార్డులున్నట్లు ప్రభుత్వం నిర్ధారణకొచ్చింది. సబ్సిడీ భారాన్ని తగ్గించుకోవాలంటే బోగస్ తెల్లకార్డులను స్వాధీనం చేసుకోవాల్సుంటుంది. ఇప్పటికే రేషన్‌షాపు డీలర్ల వద్ద బోగస్ కార్డులున్నాయన్న సమాచారం ఉంది. పౌరసరఫరాల శాఖ, రెవిన్యూ శాఖాధికారులు సంయుక్తంగా తనిఖీలు చేసేందుకు రంగం సిద్ధం చేస్తున్నారు. డీలర్ల వద్ద బోగస్ కార్డులు దొరికితే డీలర్‌షిప్పును రద్దుచేస్తామని అధికారులు హెచ్చరిస్తున్నారు. ధనికులు కొందరు తెల్ల రేషన్‌కార్డుతో సబ్సిడీ సరుకులు తీసుకోకపోయినా ఆరోగ్యశ్రీ కోసం వినియోగిస్తున్నట్లు చెబుతున్నారు. బోగస్ కార్డుల ఏరివేత పారదర్శకంగా కొనసాగిస్తే బాగుంటుంది.

# క్యాంపస్ చీటింగ్!

✦ సరికొత్త మోసగాళ్లు బయలుదేరారు

ఇంజనీరింగ్, ఎంబిఏ, ఎంసిఏ విద్యార్థుల ఉపాధి అవకాశాలపై వల విసురుతూ కొన్ని సంస్థలు క్యాంపస్ ఇంటర్వ్యూల పేరుతో మోసగిస్తుండడంతో అధిక సంఖ్యలో విద్యార్థులు వీటి బారినపడి నష్టపోతున్నారు. సాఫ్ట్‌వేర్ కంపెనీలతో సంబంధం పెట్టుకొని ఉన్నామంటూ ప్రకటనలు ఇచ్చి క్యాంపస్ సెలక్షన్స్ జరుగుతున్నాయంటూ చెప్పి విద్యార్థులను నిలువునా దగా చేస్తున్నాయి. ఇలాంటి వాటి బారినపడి నష్టపోతున్న నిరుద్యోగులు, విద్యార్థులు ఆలస్యంగా విషయం తెలుసుకొని బావురుమంటున్నారు. ఇంజనీరింగ్, ఎంబిఏ, ఎంసిఏ చదివిన వారు వేలాది మంది సాఫ్ట్‌వేర్ రంగంలో ఉపాధి పొందుతున్నారు. క్యాంపస్ ఇంటర్వ్యూలలో ఎంపికై ఆకర్షణీయమైన జీతంతో ఉద్యోగంలో చేరుతున్నారు. అలాంటి ఇంటర్వ్యూలనే అవకాశంగా మలచుకొని అడ్డదారిలో డబ్బు సంపాదించాలన్న లక్ష్యంతో కొన్ని సంస్థలు, ఊరు పేరులేని కళాశాలలతో కుమ్మక్కై క్యాంపస్ సెలక్షన్స్ పేరుతో చీటింగ్‌కు పాల్పడుతున్నారు. మంచి జీతం, మంచి ఉద్యోగం అంటూ ప్రచారం చేసి భారీగా రుసుం కట్టించుకొని తర్వాత కాల్‌లెటర్ పంపిస్తామంటూ చెప్పి పత్తాలేకుండా పోతున్నాయి. బీటెక్ పూర్తిచేసిన వారినే కాకుండా చివరి సంవత్సరం చదువుతున్న విద్యార్థులనూ ఇంటర్వ్యూలకు పిలచి పరీక్షలు నిర్వహించడం తప్ప ఎలాంటి ఉద్యోగ, ఉపాధి అవకాశాల్లేని కంపెనీలు ఇటీవల కాలంలో అధికం అయ్యాయి. గత ఏడాది జిల్లాలో పొలిచెర్లపాళెం వద్ద ఇలాంటి ఇంటర్వ్యూలే నిర్వహించగా షుమారు 900 మంది హాజరయ్యారు. ఇప్పటివరకు ఒక్కరికి కూడా ఉద్యోగం దొరకలేదు. ఇటీవల పలు సంస్థలు నిరుద్యోగుల నుంచి డబ్బులు కట్టించుకొని శిక్షణ పేరుతో పిలిపించి మోసగించడంతో వారు ఎస్పీని కలసి ఫిర్యాదు చేసిన విషయం తెలిసిందే. ఇలాంటి బోగస్ సంస్థలపై నిఘా ఉంచి నిరుద్యోగులు నష్టపోకుండా చూడాల్సిన బాధ్యత అధికారులపై ఉంది.

# చాపక్రింద నీరులా గంజాయి అమ్మకాలు!

జిల్లాలో గంజాయి అక్రమ రవాణా జోరుగా సాగుతోంది. ప్రొహిబిషన్ ఎక్సైజ్ అధికారులు ఎన్ని దాడులు జరుపుతున్నా గంజాయి అమ్మకాలు రహస్యంగా జరుగుతూనే ఉన్నాయి. నెల్లూరులో రైల్వేస్టేషన్ పరిసర ప్రాంతాలలో ఈ అమ్మకాలు సాగుతున్నట్లు సమాచారం. నగరంతోపాటు జిల్లావ్యాప్తంగా బుచ్చి, కావలి, గూడూరు తదితర ప్రాంతాలలోను వీటి అమ్మకాలు గుట్టుచప్పుడు కాకుండా జరుగుతున్నట్లు తెలుస్తోంది. కూరగాయల లోడ్‌లు, అరటి గెలలు తదితర లోడ్ వేసుకొని వెళ్లే వాహనాలతోపాటు బస్సుల లోనూ గంజాయిని నిర్ణీత ప్రదేశానికి తరలిస్తున్నారన్న సత్యం ఇటీవల పలు దఫాలు పోలీసులు, ఎక్సైజ్ అధికారులు చేసిన దాడుల్లో తేటతెల్లం అయింది. విశాఖపట్నం కేంద్రంగా

## పట్టించుకోని ఎక్సైజ్ శాఖ

గంజాయి వివిధ ప్రాంతాలకు సరఫరా అవుతోందట. అక్కడ నుంచి నెల్లూరు మీదుగా చెన్నైకు గంజాయి రవాణా జరుగుతోంది. ప్రైవేట్ బస్సుల్లో ప్రయాణికుల మాదిరిగా ఎక్కి సూట్‌కేసులలో గంజాయిని ఉంచి తరలిస్తున్నారట. దొరికితే సూట్‌కేసు వదలి వెళ్లడం, లేదంటే దర్జాగా దొరలానే చేరవేయాల్సిన చోటుకు చేరవేస్తున్నారు. ఇటీవల సున్నపుబట్టి, వెంకటాచలం, సూళ్లూరుపేట టోల్‌గేట్ల వద్ద రాత్రివేళ కాపుకాచిన అధికారులకు బస్సుల్లో రవాణా అవుతున్న షుమారు 500 కేజీల గంజాయిని స్వాధీనం చేసుకొన్నారు. నగరంలోని బుజబుజనెల్లూరు, ఆత్మకూరు బస్టాండు, సంతపేట, ములుమూడి బస్టాండు, వేదాయపాళెం, ఆర్టీసి బస్టాండు ప్రాంతాల్లో వీటిని విక్రయిస్తున్నట్లు సమాచారం. అధికారులు ఎన్ని చర్యలు చేపడుతున్నా గంజాయి అమ్మకాలు అధికంగానే ఉంటున్నాయి.

● హాస్టల్ విద్యార్థులకు

# స్కూళ్లలో మధ్యాహ్న భోజనం!

## పరిశీలిస్తున్న సంక్షేమ శాఖలు

సంక్షేమ వసతి గృహాల్లో ఉంటూ పాఠశాలల్లో చదువుతున్న విద్యార్థులకు త్వరలో మధ్యాహ్న భోజన పథకం అమలుకానుంది. ఇటీవల సంక్షేమ శాఖల కమిషనర్లతో ప్రభుత్వ కార్యదర్శి సమీక్షా సమావేశం నిర్వహించారు. ఈ సమావేశంలో హాస్టల్ విద్యార్థులకు కూడా మిగిలిన విద్యార్థులతోపాటు మధ్యాహ్న భోజన పథకం వర్తింపచేయాలన్న దానిపై చర్చించడం జరిగింది. హాస్టల్ విద్యార్థులు మధ్యాహ్న భోజనానికి పాఠశాల నుంచి వెళ్లి తిరిగి రావడం వలన కొంత సమయం వృధా అవుతుంది. ఈ క్రమంలో హాస్టల్ విద్యార్థులకు రెండు పూటలా మరింత నాణ్యతతోకూడిన భోజనం అందించాలని నిర్ణయించారు. మూడు సంక్షేమ శాఖల కమిషనర్లు కూడా ఇందుకు అంగీకారం తెలిపారు.




పార్కింగ్‌చేసిన వాహనాలకు రక్షణేది.

# ఆదమరిస్తే హాంఫట్!

## నగరంలో పెచ్చుపెరిగిన ద్విచక్రవాహనాల చోరీలు

నగరంలో ద్విచక్ర వాహనాల చోరీలు అధికమయ్యాయి. పట్టపగలు పార్కింగ్‌చేసిన వాహనాలు వున్నట్లుండి మాయమౌతుండడంతో వాహనాల యజమానులు లబోదిబోమంటున్నారు. ద్విచక్ర వాహనాల చోరీ ముఠాలు విచ్చలవిడిగా తిరుగుతుండడంతో ఇటీవల కాలంలో ఈ చోరీలు అధికమౌతున్నాయి. వాహనాన్ని పార్కింగ్ స్థలంలో పెట్టాములే అని తాపీగా వుండడానికి లేకుండా పోయింది. నెలకు షుమారు వంద వాహనాల వరకు చోరీకి గురవుతున్నట్లు తెలుస్తోంది. జిల్లావ్యాప్తంగా ఇదే తంతు. బుచ్చి, గూడూరు, ఆత్మకూరు, కావలి, కోవూరు తదితర ప్రాంతాలలో వాహనాల చోరీలు ఎక్కువగా జరుగుతున్నాయి. పోలీసులు దొంగలను పట్టుకొని వాహనాలను రికవరీ చేస్తున్నా అంతకంతకు ఈ ముఠాల ఆగడాలు హెచ్చుమీరుతుండడంతో ఇంటి నుంచి వాహనం తెచ్చి రోడ్డుపై నిలపాలంటేనే యజమానులు హడలి పోవాల్సి వస్తోంది. కొందరు స్కూటర్, బైక్‌ల మెకానిక్‌లకు ఈ చోరీ ముఠాలతో సంబంధం వుండడంతో వాహనాన్ని కాజేసిన వెంటనే పార్టులు మార్చేసి రూపురేఖలు గుర్తుపట్టకుండా చేసేస్తున్నారు. మరోవైపు ద్విచక్ర వాహనాలు అమ్మే కొందరు ఇలాంటి దొంగ వాహనాలను తక్కువ ధరకు కొని అమ్మేస్తున్నారు. ఇలాంటివి గతంలో బట్టబయలైన సందర్భాలు ఉన్నాయి. దొంగతనానికి గురైన వాహనాలను దొంగలు తీర ప్రాంతాలలోని వారికి దూర ప్రాంతాలలో అమ్మేస్తున్నట్లు సమాచారం. కొన్ని సమస్యాత్మక ప్రాంతాల్లో దొంగ బండ్లను గుర్తించినా పోలీసులు వాటిని తీసుకవచ్చేందుకు జంకుతుండడంతో దొంగ వాహనాలను తక్కువ ధరకు కొని తీరప్రాంతాల్లో తిరుగుతున్నట్లు కొందరు పోలీసు సిబ్బందే చర్చించుకొంటున్నారు.

# ఈవ్‌టీజింగ్‌పై ఇక నిఘా!

జిల్లాలో జరుగుతున్న ఈవ్‌టీజింగ్‌పై పోలీసు శాఖ నిఘా ముమ్మరం చేసింది. ముఖ్యంగా కళాశాలలు, పాఠశాలల్లో విద్యార్థినులు ఈవ్‌టీజింగ్‌కు గురౌతున్నారు. ఈ సంఘటనపై పోలీసులకు నిత్యం ఫిర్యాదులందుతున్నాయి. ఈవ్‌టీజింగ్ బాధలు భరించలేక కొందరు మధ్యలోనే చదువుకు స్వస్తి పలుకుతున్నారు. జిల్లా ఎస్పీని కలిసి ఈవ్‌టీజింగ్‌కు పాల్పడేవారిపై కఠిన చర్యలు తీసుకోవాలని విద్యార్థినుల తల్లితండ్రులు విజ్ఞప్తి చేశారు. ఇందుకు స్పందించిన ఎస్పీ కళాశాలలు, పాఠశాలల్లో ఫిర్యాదు బాక్సులను ఏర్పాటుచేస్తామని ప్రకటించారు. కళాశాలల యాజమాన్యాలు ఈవ్‌టీజింగ్‌పై వెంటనే స్పందించకుంటే క్రిమినల్ కేసులు నమోదుచేసే అవకాశం ఉంది. ఫిర్యాదు బాక్సుల్లో లభ్యమయ్యే సమాచారంతో విచారణ జరిపి వాస్తవాలు రుజువైతే ఈవ్‌టీజింగ్ చేసిన వారిపై కేసు నమోదుచేసి అరెస్ట్ చేస్తారు. విద్యార్థినులకు ఎటువంటి అసౌకర్యం కలిగించినా వదిలిపెట్టే అవకాశం ఉండదని పోలీసులు హెచ్చరిస్తున్నారు. ఇప్పటికైనా కళాశాలలకు వెళ్లే విద్యార్థులు బుద్ధిగా చదువుకోకుండా అమ్మాయిలను ఈవ్‌టీజింగ్ చేస్తే కటకటాలు లెక్క పెట్టాల్సి వస్తుందని గుర్తుంచుకోవాలి.

● సంక్షోభంలో విద్యుత్ శాఖ

# కోట్ల రూపాయల్లో పేరుకొన్న బకాయిలు!

**రోజురోజుకు విద్యుత్ వినియోగం ఎక్కువవుతున్నా సంస్థకు రావాల్సిన బకాయిలు మాత్రం రావడం లేదు. దీంతో సంస్థ అభివృద్ధి కుంటుపడే పరిస్థితులు జిల్లాలో నెలకొని ఉన్నాయి.**



విద్యుత్ భవన్ వసూళ్లు ఎలా చేస్తుందో చూడాలి.

జిల్లావ్యాప్తంగా ఎపి ట్రాన్స్‌కోకు కోట్ల రూపాయల విద్యుత్తు బకాయిలు పేరుకుపోయాయి. వీటిలో మునిసిపాల్టీలు అగ్రస్థానంలో ఉన్నాయి. ట్రాన్స్‌కో సిబ్బంది విద్యుత్తు బకాయిలు చెల్లించాలని ఎన్నిసార్లు నోటీసులు ఇచ్చినా పట్టించుకునే వారు లేకుండా పోయారు. ప్రభుత్వ కార్యాలయాలు కూడా లక్షల రూపాయల్లో బకాయిలు చెల్లించాల్సి ఉంది. సాధారణ ప్రజలు ఒక నెల విద్యుత్తు బిల్లు చెల్లించకుంటే మరుసటి నెలలో సర్వీసును తొలగిస్తుంటారు. ప్రభుత్వ కార్యాలయాలు, మునిసిపాల్టీలు కోట్ల రూపాయలు బకాయిలున్నా వాటిని రాబట్టేందుకు చర్యలు తీసుకోవడం లేదు. ట్రాన్స్‌కో ఎస్ఇ నందకుమార్ విద్యుత్తు బకాయిల గురించి వెల్లడించారు. మునిసిపాల్టీలు, ప్రభుత్వ కార్యాలయాలు బకాయిలు చెల్లించేందుకు ముందుకు రాకపోవడంతో ట్రాన్స్‌కో రాష్ట్రస్థాయి అధికారులు రంగంలోకి దిగాల్సిన పరిస్థితి ఏర్పడింది. రోజురోజుకు విద్యుత్తు వినియోగం అధికం కావడం, మరోప్రక్క సంస్థకు రావాల్సిన బకాయిలు రాకపోవడంతో సంస్థ అభివృద్ధి కుంటుపడే అవకాశం ఉందని ట్రాన్స్‌కోకు నెల్లూరు కార్పొరేషన్‌తోపాటు కావలి, గూడూరు, వెంకటగిరి మునిసిపాల్టీలు భారీమొత్తంలో బకాయిలు పడి ఉన్నాయి. వీటి గురించి అనేక సంవత్సరాల నుంచి ట్రాన్స్‌కో అధికారులు లేఖలు రాస్తున్నారే తప్ప తదుపరి చర్యలు తీసుకునేందుకు ముందుకు వెళ్లడం లేదు.

వివిధ పరిశ్రమలు కూడా భారీ మొత్తంలోనే బకాయిలున్నాయి. ఇన్ని కోట్ల రూపాయలు విద్యుత్తు బకాయిలుంటే ఎందుకు చర్యలు తీసుకోలేక పోతున్నారన్నది ప్రశ్న. క్రిందిస్థాయి సిబ్బంది బకాయిల కోసం చర్యలు తీసుకునే అవకాశం ఉండదు. ఎస్ఇ, డిఇ స్థాయి అధికారులు వీటి జోలికి వెళ్లడం లేదు. ప్రతి ఏడాదికి బిల్లులు మరింత పెరిగిపోతూనే ఉన్నాయి. మునిసిపల్ కార్పొరేషన్ అధికారులు ఇందుకు మరో విధమైన కారణం చెబుతున్నారు. వివిధ ప్రభుత్వ కార్యాలయాలు చెల్లించాల్సిన పన్నులు లక్షల్లో పేరుకుపోయి ఉన్నాయంటున్నారు. వీటిని చెల్లిస్తే తాము విద్యుత్తు బకాయిలు చెల్లించేందుకు నిధుల కొరత ఉండదని వాదిస్తు న్నారు.

ఇలా ఒక శాఖపై మరో శాఖ అధికారులు పరస్పర ప్రకటనలు చేసుకోవడం మినహా బకాయిలు చెల్లింపు కోసం ఏ ఒక్క అధికారి కూడా ప్రయత్నాలు చేయడం లేదు. బకాయిల చెల్లింపు విషయంపై ట్రాన్స్‌కో సిఎండి దృష్టికి తీసుకెళ్లినట్లు తెలిసింది. మునిసిపాల్టీలకు విద్యుత్తును తొలగిస్తే ప్రజలకు ఇబ్బంది కలుగుతుందన్న ఉద్దేశంతో ఆ పని చేయడం లేదని ట్రాన్స్‌కో అధికారులు వ్యాఖ్యానిస్తున్నారు. వీధిలైట్లు, తాగునీటి సరఫరాను దృష్టిలో ఉంచుకొని విద్యుత్తును కొనసాగిస్తూ వస్తున్నారు. గ్రామ పంచాయితీలు కూడా మునిసిపాల్టీల బాటలో పయనిస్తున్నాయి. గ్రామ పంచాయితీలకు నిధులు ఉన్నప్పటికీ ఇతర అవసరాలకు వినియోగిస్తూ విద్యుత్తు బిల్లులు చెల్లించడం లేదు.

ట్రాన్స్‌కో అధికారుల లెక్కల ప్రకారం జిల్లా వ్యాప్తంగా దాదాపు 200 కోట్ల రూపాయలు బకాయిలు ఉన్నట్లు తెలిసింది. రాష్ట్రస్థాయి అధికారుల నుంచి ఆదేశాలు అందితే బకాయిలున్న సంస్థలు, కార్యాలయాల పేర్లను పత్రికల్లో ప్రకటించే అవకాశం ఉంది. బకాయిలు పేరుకు పోవడంతో ఇతర రాష్ట్రాల నుంచి విద్యుత్తు కొనుగోలు కష్టతరంగా మారనుందని ఒక అధికారి వెల్లడించారు.

J

# తూతూ మంత్రంగా రెవెన్యూ సదస్సులు!

**భూ సమస్యల పరిష్కారం కోసమంటూ జిల్లాలో ప్రారంభమైన రెవెన్యూ సదస్సులు నామమాత్రంగా జరుగుతున్నాయి. ప్రభుత్వ ఆదేశాల ప్రకారం ఈ సదస్సులు జరుగుతున్నాయే తప్ప ఇందులో చిత్తశుద్ధి ఏమాత్రం కానరావడం లేదు.**

భూసమస్యల పరిష్కారం కోసం జిల్లావ్యాప్తంగా రెవెన్యూ సదస్సులు నిర్వహించేందుకు అధికారులు శ్రీకారం చుట్టారు. డిసెంబర్ ఒకటి నుంచి 30వ తేది వరకు అన్ని రెవెన్యూ గ్రామాలలో సదస్సులు ఏర్పాటుచేసే విధంగా ప్రణాళిక రూపొందించారు. మండలంలో రోజుకో రెవెన్యూ గ్రామంలో సదస్సు నిర్వహించాలని కలెక్టర్ ఆదేశించారు. జిల్లావ్యాప్తంగా నెలరోజులపాటు రెవెన్యూ సదస్సుల నిర్వహణలో యంత్రాంగం నిమగ్నమవుతుంది. తహశీల్దార్, ఆర్ఐ, విఆర్వో, సర్వేయర్లు తప్పనిసరిగా సదస్సులో పాల్గొనాల్సి వుంటుంది.

ప్రధానంగా గ్రామీణ ప్రాంతాల్లో భూసమస్యలు అధికంగా వున్నాయి. ఈ సమస్యలను గ్రామాల్లో నిర్వహించే సదస్సుల్లో అక్కడికక్కడే పరిష్కరించాలని వున్నా రాజకీయ కారణాలతో అధికారులు ఏమీ చేయలేక పోతున్నారు. ఉదయం 10గంటల నుంచి సాయంత్రం 5గంటల వరకు ఈ కార్యక్రమం జరగాలి. అయితే రెవెన్యూ అధికారులు 11గంటలకు గ్రామానికి వెళ్లి మధ్యాహ్నానికే కార్యక్రమాన్ని ముగించేస్తున్నారు. ఒక్క విఆర్వోను మాత్రం గ్రామంలో వుంచి తహశీల్దార్, ఆర్ఐలు కార్యాలయానికి తిరిగి వెళ్తున్నారు. రెవెన్యూ సదస్సుల ఏర్పాటు గురించి ముందుగా ప్రచారం నిర్వహించాల్సి వుండగా ఆ దిశగా ఎక్కడా చర్యలు తీసుకున్న సందర్భాలు కనిపించడం లేదు.

మూడు నెలల క్రితం ఇదే తరహాలో గ్రామాల్లో రెవెన్యూ సభలు జరిగాయి. ఈ సభల నిర్వహణప్పుడు కూడా భూసమస్యలు పరిష్కరిస్తామని అధికారులు ప్రకటించారు. అయితే అధికారులు ప్రకటించిన విధంగా మాత్రం ఒక్క భూసమస్య కూడా పరిష్కారానికి నోచుకోలేకపోయింది. ప్రస్తుతం జిల్లాలో నిర్వహిస్తున్న రెవెన్యూ సదస్సులకు హాజరవుతున్న అధికారులను ప్రజలు పలు సమస్యలపై నిలదీస్తున్నారు. జిల్లా కలెక్టర్‌తో నిర్వహించే ప్రజావిజ్ఞప్తుల దినంలో సమర్పించిన వినతి పత్రాలపై చర్యలు తీసుకోవాలని కలెక్టర్ నుంచి మండల కార్యాలయానికి పంపుతారు. వీటిపై అధికారులు పెద్దగా దృష్టిసారించిన సందర్భాలు లేవు.

వివిధ పనుల నిమిత్తం మండల తహశీల్దార్ కార్యాలయానికి ప్రజలు వెళ్తుంటారు. పట్టాదారు పాసుపుస్తకాలు, అండగళ్ కాపీలు అందజేయాలని దరఖాస్తులు సమర్పిస్తుంటారు. వీటితోపాటు విద్యార్థులకు అవసరమైన కుల, ఆదాయ, నివాస ధృవీకరణ పత్రాలు జారీ చేయాలని కోరుతుంటారు. వీటన్నింటిపై సకాలంలో అధికారులు, సిబ్బంది స్పందిస్తే ఎటువంటి కాలయాపన లేకుండా అందే అవకాశం వుంటుంది. ప్రతి చిన్న సమస్య కోసం రోజులు, నెలల తరబడి కార్యాలయం చుట్టూ త్రిప్పుకోవడం అలవాటుగా మార్చుకున్నారు. అధికారులు అవలంభిస్తున్న వైఖరి కారణంగా ప్రజలు విసిగిపోతున్నారు. రెవెన్యూ సదస్సుల ఉద్దేశ్యం మంచిదే అయినా అవలంభించే విధానాలే ఇబ్బందికరంగా పరిణమిస్తున్నాయి.

ప్రభుత్వ ఆదేశాల ప్రకారం కాదనలేక సదస్సులు నిర్వహిస్తున్నారు తప్ప ఇందులో చిత్తశుద్ధి కనిపించడం లేదు. ఇప్పటికైనా అధికారులు స్పందించి రెవెన్యూ సదస్సులో ప్రజల సమస్యలను పరిష్కరించాల్సిన అవసరం వుంది.



మొహరం పండుగను పురస్కరించుకొని తన తల్లితండ్రుల జ్ఞాపకార్థం అల్లూరు తూర్పు ముస్లిం వీధిలో అన్నదానం చేస్తున్న అల్లూరు రహీం. ప్రక్కన ఆర్‌కెజె.కాలేజి ప్రిన్సిపల్ మేదా రామకృష్ణారెడ్డి, పంచాయితీ ఇఓ వెంకటేశ్వర్లు.

# పడమటిపాలెం నుంచి ఇసుక అక్రమరవాణా!

## పట్టించుకోని అధికారులు.

జిల్లాలో ఇసుక అక్రమరవాణా యదేచ్ఛగా జరుగుతోంది. అక్కడ ఇక్కడ అన్న తేడా లేకుండా ఎక్కడపడితే అక్కడ ఇసుకను త్రవ్వి తరలించుకపోతున్నా పట్టించుకొనే నాధుడే లేకుండా పోయారు. ప్రభుత్వ ఉత్తర్వుల ప్రకారం జిల్లాలో ఇసుక టెండర్ల గడువు ముగిసి నెలరోజులైపోయినా పట్టించుకోకపోవడంతో ఇసుక కాంట్రాక్టర్లు తమకేమి సంబంధం లేనట్లు అక్రమ త్రవ్వకాలు జరుపుతున్నారు. ముఖ్యంగా సంగం మండలంలో ఇలాంటి త్రవ్వకాలు అధికంగా జరుగుతున్నాయి. గ్రామపరిధిలో వున్న క్వారీ పేరు చెప్పి పడమటిపాలెం పొలిమేరలో వున్న ఇసుకను పెద్దఎత్తున త్రవ్వి తరలించుకపోతున్నారు. ఈ అక్రమ ఇసుక తరలింపుపై పలుమార్లు మండల తహశీల్దార్‌కు చెప్పినా ఫలితం లేకుండాపోయిందని ఈప్రాంత ప్రజలు ఆరోపిస్తున్నారు. మండల రెవెన్యూ సిబ్బందితోపాటు



జోరుగా లారీల్లో ఇసుక అక్రమ రవాణా.

మైనింగ్ అధికారులకు ఈ విషయం తెలిసినా ఎవ్వరూ ఆ వైపు కన్నెత్తి చూడడంకాని, అక్రమరవాణాను అరికట్టే ప్రయత్నం కాని చేయకపోవడానికి కారణం ఇసుక కాంట్రాక్టర్ల నుంచి ముడుతున్న లంచాల సొమ్ము కారణమనే ఆరోపణలు వినవస్తున్నాయి. జిల్లాకలెక్టర్ అయినా ఇలాంటి వాటిపై దృష్టిసారించి ఇసుక అక్రమ త్రవ్వకాలను అరికట్టాలని స్థానికులు కోరుకుంటున్నారు.

# బీద-వాకాటి మధ్య సంవాదం!





## సర్దిచెప్పిన రామనారాయణ

సంక్షేమ పథకాల అమలు, వాటి వలన ప్రజలకు కల్గుతున్న మేలుపై కావలి శాసన సభ్యుడు బీద మస్తాన్‌రావు, శాసన మండలి సభ్యుడు వాకాటి నారాయణ రెడ్డి మధ్య వాదోపవాదాలు జరిగాయి. దగదర్తి రచ్చబండ కార్యక్రమం అందుకు వేదికయ్యింది. మంత్రితోపాటు వీరిరువురు రచ్చబండకు హాజరయ్యారు. ముందుగా వాకాటి నారాయణరెడ్డి ప్రసంగిస్తూ కాంగ్రెస్ ప్రభుత్వ హయాంలోనే పేదలకు న్యాయం జరిగిందని, పలు పథకాల వలన లబ్ధి చేకూరిందని చెప్పారు. ఈ ఘనత కాంగ్రెస్ ప్రభుత్వానిదేనని, తెలుగుదేశం ప్రభుత్వ కాలంలో పేదలు రేషన్‌కార్డులు, ఇతర పథకాల కోసం సంవత్సరాల తరబడి తిరిగినా ఫలితం లేకుండా వుండిందని అన్నారు. వాకాటి వ్యాఖ్యలతో అదే వేదికపై వున్న బీద మస్తాన్‌రావు తీవ్రంగా స్పందించారు. సంక్షేమ పథకాలు ప్రారంభమయ్యింది తెలుగుదేశం హయాంలోనేనని గుర్తు చేశారు. ఎన్‌టి రామారావు పేద ప్రజలకు కిలో రెండురూపాయల బియ్యం తదితర జనరంజక పథకాలను ప్రవేశపెట్టారని, ఈ సంగతి ప్రజలందరికీ తెలుసునని చెప్పారు. ఇరువురి మధ్య మాటల తూటాలు పేలుతుండడంతో వేదికపై వున్న మంత్రి సర్దిచెప్పడంతో వివాదం ముగిసింది. కార్యక్రమం తర్వాత మాత్రం వాకాటి, బీద మస్తాన్‌రావు తాళ్లూరు రమణయ్య నాయుడు ఇంట్లో ఏర్పాటు చేసిన విందుకు కలసి హాజరుకావడం అక్కడున్న వారిని ఆశ్చర్యానికి గురి చేసింది. రాజకీయమా! మజాకా!!

# ప్రజాసమస్యలు పరిష్కరించాలి!



ప్రజాసమస్యల పరిష్కారానికి ప్రతి కార్యకర్త కృషి చేయాలని వెంకటగిరి మాజీ శాసనసభ్యురాలు నేదురుమల్లి రాజ్యలక్ష్మి పిలుపునిచ్చారు. ఇటీవల స్థానికంగా నిర్వహించిన కార్యకర్తల సమావేశంలో ఆమె మాట్లాడుతూ కార్యకర్తలకు దిశ నిర్దేశం చేశారు. గ్రామాలలో పింఛన్, పక్కా ఇళ్లు, ఇళ్ల స్థలాల కావాలనే ప్రజల వినతులపై స్పందించి సమస్య పరిష్కారమయ్యేలా చూడాలన్నారు. నియోజకవర్గంలోని ఆరు మండలాల్లో రెండు మండలాలను కరువు మండలాలుగా ప్రభుత్వం ప్రకటించిందని, మిగిలిన నాలుగింటిని కరవు మండలాలుగా గుర్తించేందుకు తగిన ప్రయత్నం చేస్తానని హామీ ఇచ్చారు. తాను నియోజకవర్గం వీడతాననే ప్రచారాన్ని ఖండించారు. ఎలాంటి పరిస్థితుల్లోనూ వెంకటగిరి నియోజకవర్గాన్ని వీడేది లేదన్నారు. అనంతరం ఆమె పట్టణంలోని పలు ప్రాంతాలతోపాటు డక్కిలిలోనూ పర్యటించారు. డక్కిలి మండలంలోని రైతులు సాయిగంగపై ఆధారపడి సాగు చేసిన పైర్లు ఎండిపోతున్నాయన్న సమస్యను రాజ్యలక్ష్మమ్మ దృష్టికి తీసుకొని వచ్చారు. ఆమె స్పందిస్తూ తక్షణం నీటిని విడుదల చేసేలా జిల్లాకలెక్టర్, తెలుగుగంగ ప్రాజెక్ట్ ఉన్నతాధికారులతో మాట్లాడతానని రైతులకు హామీ ఇచ్చారు. భూసమస్యలపై తహశీల్దార్ స్పందించడం లేదని వడ్డిపల్లి,

## కార్యకర్తలకు రాజ్యలక్ష్మమ్మ సలహా.

పాతనాలపాడు గ్రామస్తులు ఫిర్యాదు చేశారు. పంచాయితీల వారీగా వివిధ సమస్యలను ఓపికగా అడిగి తెలుసుకొని వాటి పరిష్కారానికి కృషి చేస్తానని హామీ ఇవ్వడంతో పలు ప్రాంతాల ప్రజలు సంతోషించారు. రాజ్యలక్ష్మమ్మ వెంట పెంచలకోన ఆలయ ఛైర్మన్ రవీంద్రరెడ్డి, వెంకటగిరి కాంగ్రెస్‌పార్టీ నాయకులు పలువురు పాల్గొన్నారు.

# భలే స్నేహితులు!

నాకు నువ్వు, నీకు నేను అనే పాటను గుర్తుచేస్తూ సూళ్లూరుపేట ఎమ్మెల్యే పరసారత్నం, శాసనమండలి సభ్యుడు వాకాటి నారాయణరెడ్డి ఒకరినొకరు పొగడ్తలతో ముంచెత్తుకోవడం, పార్టీలు వేరైనా ఇద్దరి మనసులు ఒక్కటేనని చెప్పడం నియోజకవర్గ ప్రజలను ఆశ్చర్యానికి గురి చేసింది. ఈ విచిత్రమైన సంఘటన ఇటీవల జరిగిన రచ్చబండ కార్యక్రమంలో చోటు చేసుకొంది. కార్యక్రమానికి కలసి వచ్చిన పరసారత్నం,

## పరసా... వాకాటి భాయి భాయి!

వాకాటి నారాయణరెడ్డి ఒకరినొకరు ఆత్మీయంగా ఆలింగనం చేసుకోవడంతోపాటు, ఇరువురు కలసి నియోజకవర్గాన్ని అభివృద్ధి పథంలో నడిపిస్తామని చెప్పడం అందరిని ఆకట్టుకొంది. పార్టీలు, శరీరాలు వేరైనా మనసు ఒక్కటేనని చెప్పడంతో ఇరు పార్టీల కార్యకర్తలు ఇదేం రాజకీయం అంటూ అయోమయానికి గురయ్యారు. దీనికితోడు ఆ ప్రాంతమంతా కట్టిన ఫ్లెక్సీలలో పరసా, వాకాటి ఫోటోలు కలసి వుండడం మరింత గందరగోళానికి గురి చేసింది ఈ ప్రాంత ప్రజలను.

# గూడూరు రైతులను దెబ్బ తీసిన వర్షాలు!

ఇటీవల కురిసిన వర్షాలు గూడూరు డివిజన్‌లోని రైతాంగాన్ని ఇక్కట్లపాలు చేశాయనే చెప్పాలి. వర్షాల కారణంగా వేల ఎకరాల్లో వరినార్లు నీటమునిగాయి. నారుమళ్లలో నీరు చేరడంతో కుళ్లిపోయాయి. నెలరోజుల క్రిందట వ్యవసాయపనులు ప్రారంభించిన రైతులు నార్లు సిద్ధం చేసుకోగా, కొన్ని ప్రాంతాల్లో నాట్లు వేయడం పూర్తయ్యింది. ఈ తరుణంలో భారీ వర్షాలు కురవడంతో అవన్నీ నీటమునిగి రైతులకు నష్టాన్ని మిగిల్చాయి. ఎంతో ఆశ పెట్టుకొన్న రైతులకు నిరాశను మిగిల్చాయి వర్షాలు. అసలే అన్ని విధాల ధరలు పెరిగి, గిట్టుబాటు ధరలేక తీవ్రంగా నష్టపోయిన రైతులను ఈ వర్షాలు మరింత దెబ్బతీశాయి.

## కుళ్లిపోయిన నారుమళ్లు

# నిమ్మసాగుకు సలహాలు!

దీర్ఘకాలిక పంటలను సాగు చేయడం వల్ల అధిక దిగుబడులు సాధించవచ్చని వెంకటగిరి దీనీ, నిమ్మ పరిశోధనా కేంద్రం శాస్త్రవేత్త గోవిందరాజులు సూచించారు. నిమ్మపంట సాగుపై ఆయన రైతులకు పలు సూచనలు చేశారు. నిమ్మపంట సాగులో యాజమాన్య పద్ధతులను తప్పనిసరిగా పాటించడం వల్ల మంచి దిగుబడులు వస్తాయన్నారు. చెట్టుకు చెట్టుకు మధ్య ఆరు మీటర్ల దూరం వుండాలన్నారు. సరైన ఎరువులు వాడడం కూడా మంచి ఫలితాలనిస్తుందన్నారు. నిమ్మలో తెగుళ్లను తట్టుకొని అధిక దిగుబడులు నిచ్చే పెట్లూరు సెలక్షన్ -1 రకాన్ని సాగుచేసుకోవడం మంచిదన్నారు. గూడూరు డివిజన్‌లోని రైతాంగంతోపాటు కడపజిల్లా వీరమనాయునిపల్లి ప్రాంతాల రైతులు నిమ్మసాగుపై జరిగిన అవగాహన కార్యక్రమానికి హాజరై తమ సందేహాలను నివృత్తి చేసుకొన్నారు.

# జలదిగ్బంధంలో ముంగమూరు!

## పాతికేళ్లుగా ఇదే తంతు!

ఇటీవల కురిసిన వర్షాలకు జిల్లా వ్యాప్తంగా పలు ప్రాంతాలు ముంపుకు గురయ్యాయి. ఏకధాటిగా కురిసిన వర్షాలకు ప్రజాజీవనం అస్తవ్యస్తం అయ్యింది. బోగోలు మండలంలోను ప్రజలు జలదిగ్బంధం కారణంగా తీవ్ర ఇబ్బందులు పడ్డారు. అయితే స్థానిక పోలీసులు ముందు జాగ్రత్త చర్యలు తీసుకోవడంతో ప్రజలకు ఎలాంటి ఇబ్బంది కలుగలేదు. వాగులో నీళ్లుపైకి చేరడం రాకపోకలకు తీవ్ర ఆటంకం కలగడంతో విషయం గమనించిన బిట్రగుంట ఎస్ఐ ఖాజావలి తన సిబ్బందితో అక్కడకు చేరుకొని వాగులో ఎవరూ ప్రమాదానికి గురికాకుండా తగిన రక్షణ చర్యలు చేపట్టడంతోపాటు ముంపు గ్రామాల వారిని సురక్షిత ప్రాంతాలకు తరలించారు. ముంగమూరు, జువ్వలదిన్నె ప్రాంతాలలో పోలీసు సిబ్బందిని నియమించడంతో వర్షాల కారణంగా ఎవరూ ప్రాణాపాయం కలుగకుండా చర్యలు తీసుకోవడం పట్ల పలువురు అభినందిస్తున్నారు.

# పాఠశాల గదుల నిర్మాణానికి గ్రహణం!

**● వింధూరులో ఇదీ పరిస్థితి.**

పాఠశాల అదనపు గదుల నిర్మాణంలో తలెత్తిన రాజకీయాల కారణంగా విద్యార్థులు చెట్లక్రింద చదువు సాగించాల్సిన పరిస్థితులు ఏర్పడ్డాయి గూడూరు మండలం విందూరు గ్రామంలో. అక్కడ గల జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో దాదాపు నాలుగు వందల మంది విద్యార్థులు చదువుకొంటున్నారు. కేవలం నాలుగే గదులు వున్నాయి. విద్యార్థుల సంఖ్యకు తగినట్లు గదులు లేక వున్నవి సరిపోక చెట్లక్రింద చదువుకోవాల్సి వస్తోంది. వీటిలో ఒక గదిని కంప్యూటర్లు వుంచేందుకు వినియోగిస్తుండడంతో గదుల కొరత తీవ్రంగా వుంది. ఈ పరిస్థితులలో రాజీవ్ విద్యామిషన్ అదనపు గదులు నిర్మాణానికి నిధులు మంజూరు చేసింది. ఈ నిర్మాణాల విషయంలో రాజకీయాలు చోటు చేసుకోవడంతో పాఠశాల అభివృద్ధికి గ్రహణం పట్టింది. అదనపు గదుల నిర్మాణాలకు సంబంధించిన కాంట్రాక్టు పనులను తమవారికి ఇవ్వాలని అటు గూడూరు శాసనసభ్యుడు బల్లి దుర్గాప్రసాద్, ఇటు కాంగ్రెస్‌పార్టీ నేత పనబాక కృష్ణయ్యలు ఒత్తిడి తెస్తుండడంతో పనులకు బ్రేక్ పడింది. గ్రామంలోని వారి వారి అనుచరులకు కాంట్రాక్టు పని ఇప్పించుకొనేందుకు ఇరువురు నేతలు ప్రయత్నిస్తుండడంతో ఆ ప్రభావం పాఠశాల విద్యార్థులపై పడుతోంది. రాజకీయాలు పక్కనపెట్టి అదనపు గదులు ఏర్పాటు చేయించాలని పలువురు విద్యార్థుల తల్లి దండ్రులు కోరుతున్నా స్పందన లేకపోవడంతో ఎప్పటికి ఇవి పూర్తవుతాయో తెలియని అయోమయ పరిస్థితి నెలకొనింది.




**తిక్కవరపు సుబ్బరామరెడ్డి లలితా కళా పరిషత్ అవార్డును హైదరాబాద్ రవీంద్రభారతిలో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో అక్కినేని నాగేశ్వరరావు, రాష్ట్ర గవర్నర్ నరసింహన్, కవి సినారె, గాయని సుశీల చేతుల మీదుగా అందుకొంటున్న నెల్లూరు రంగస్థల నటుడు పొన్నాల రామసుబ్బారెడ్డి.**

**● గెలుపుకు**

# ప్రసన్న పూజలు!

కోవూరు స్థానానికి ఉప ఎన్నికను తెచ్చిన మాజీ శాసనసభ్యుడైన నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి ఇప్పుడు తన గెలుపు భారాన్ని నియోజకవర్గ ప్రజలతో పాటు, ఇందుకూరుపేట మండలం గంగపట్నం చాముండేశ్వరిపైనా పెట్టాడు. రసవత్తరంగా మారనున్న త్రిముఖ పోటీలో ఇంతవరకు తెలుగుదేశం, కాంగ్రెస్ పార్టీల అభ్యర్థి లెవరనేదానిపై స్పష్టత లేకున్నా ప్రసన్న మాత్రం వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ తరపున బరిలోకి దిగనుండడంతో ఆయన ఇప్పటి నుంచే ఎన్నికల ప్రచారాన్ని చేపట్టేశాడు. పలు ప్రాంతాల ప్రజలను కలుసుకొని విజయం చేకూర్చిపెట్టాలని కోరుతున్న ప్రసన్న పనిలో పనిగా చాముండేశ్వరి అమ్మవారిని దర్శించుకొని ఆమె కటాక్షం కోరాడు. ఆలయానికి వచ్చి ప్రత్యేక పూజలు చేసిన ఆయన అక్కడి వారితో ఆత్మీయ సమావేశం నిర్వహించారు. అలాగే స్వగ్రామానికి వచ్చిన ప్రముఖ పారిశ్రామికవేత్త జివికెను కలసి ఆశీర్వచనం కోరాడట. చేతులారా పదవీభ్రష్టుడైన ప్రసన్నకుమార్‌రెడ్డి తిరిగి ఎమ్మెల్యేగా విజయం సాధించేందుకు ఇప్పటి నుంచే చాపక్రింద నీరులా ప్రయత్నాలు మొదలు పెట్టడం నియోజకవర్గంలో చర్చనీయాంశమయ్యింది.

**గంగపట్నం చాముండేశ్వరి ఆలయ సందర్శన**

**● టీచర్ భర్త చేతిలో**

# దెబ్బలుతిన్న హెడ్‌మాస్టర్!

ఉపాధ్యాయురాలి భర్త అదే పాఠశాల ప్రధానోపాధ్యాయుడిపై దాడి చేసి కొట్టడం తోటపల్లి గూడూరు మండలంలో సంచలనం రేపింది. దీనికి సంబంధించిన వివరాలు ఇలా వున్నాయి. మండలంలోని కోడూరు పంచాయితీ మేజర్ గ్రామమైన కోనేటితోపు గిరిజన కాలనీలో ప్రాథమిక పాఠశాల వుంది. అక్కడ ప్రధానోపాధ్యాయుడిగా గౌరీశంకర్, అసిస్టెంటుగా భారతి పని చేస్తున్నారు. స్కూలుకు సంబంధించిన రికార్డుల విషయమై పలుమార్లు అడిగినా భారతి పట్టించుకోకపోవడంతో, హెడ్‌మాస్టర్ గౌరీశంకర్ నెల్లూరులోని ఆమె ఇంటికి వెళ్లి, పిలచి మాట్లాడడానికి ప్రయత్నించడంతో ఆమె భర్త నరేంద్ర ఆగ్రహించాడట. అంతటితో ఆగక మరుసటిరోజు స్కూలుకు వచ్చి అందరు చూస్తుండగా ప్రధానోపాధ్యాయుడిపై దాడి చేసి చితకబాదడంతో తీవ్ర నెత్తుటి గాయాలైన ఆయన భయంతో పరుగులు పెట్టాడు. అది చూసి పాఠశాలలోని పిల్లలు భయభ్రాంతులకు గురయ్యారు. దెబ్బలు తిన్న గౌరీశంకర్ పోలీస్‌స్టేషన్‌కు వెళ్లి ఫిర్యాదు చేయపోగా అక్కడి ఎస్ఐ అతన్ని భయపెట్టడంతో గాయాల బాధను భరిస్తూ గమ్మున వెనుతిరగడం చర్చనీయాంశమయ్యింది. ఈ వివాదానికి కారణం గతంలో గౌరీశంకర్‌కు, భారతి భర్త నరేంద్రకు మధ్య జరిగిన ఆర్థిక లావాదేవీలేనని తెలుస్తోంది. మొత్తం మీద పట్టపగలు పాఠశాల ప్రధానోపాధ్యాయుడిపై ఒక వ్యక్తి వచ్చి దాడికి దిగినా రక్షణ లేకుండాపోవడం విచారకరం.

# జోరుగా నాటుసారా అమ్మకాలు!

ఉదయగిరి సర్కిల్ పరిధిలోని పలు గ్రామాలలో గంజాయి, నాటుసారా అమ్మకాలు జోరుగా సాగుతున్నాయి. ఉదయగిరితోపాటు మారుమూల ప్రాంతాల్లో వీటి అమ్మకాలు అధికంగా వుంటున్నాయి. దీనితోపాటు కడపజిల్లా బద్వేలు నుంచి అక్రమంగా మద్యం ఈ ప్రాంతంలోని డాబాలకు, బెల్టుషాపులకు సరఫరా అవుతోంది. నందిపాడు, అర్లపడియ, అప్పసముద్రం, దుత్తలూరు, బిజ్జంపల్లి, చెరువులపల్లి, బసినేనిపల్లి, రేవమ్మ చెరువులాంటి ప్రాంతాలలో గంజాయి అమ్మకాలు విచ్చలవిడిగా జరుగుతున్నాయి. దీని వలన యువత దారి తప్పుతోంది. ఇళ్లలో డబ్బులు అవసరాలకు అందని కారణంగా గంజాయికి అలవాటుపడిన వారు చిల్లర దొంగతనాలకు పాల్పడుతున్నారు. ఇంత బహిరంగంగా గంజాయి, నాటుసారా అమ్మకాలు జరుగుతున్నా ఎక్సైజ్ అధికారులు పట్టనట్లు వ్యవహరిస్తుండడం విమర్శల పాలవుతోంది. ముఖ్యంగా అధికారులు అక్రమ వ్యాపారాలపై తమకు సమాచారం అందించాలని 94409 02522 అనే ఫోన్ నెంబర్‌ను ఇచ్చారు. కొందరు ఈ అమ్మకాలపై సమాచారం అందించేందుకు ఆ నెంబర్‌కు ఫోన్ చేస్తే స్పందించకపోవడంతో ఫోన్ నెంబర్ ఎందుకిచ్చినట్లు అనే ప్రశ్న తలెత్తుతోంది.

**ఉదయగిరిలో అరికట్టేవారెవరు?**

# ప్రారంభానికి సిద్ధమైన పాఠశాల!

**● రూ.31లక్షల మాధ్యమిక శిక్షా అభియాన్ నిధులు వెచ్చించి నిర్మించారు.**




అల్లూరు మండలం ఇస్కపల్లి పంచాయితీలో గల ఉన్నతపాఠశాలకు నూతన భవనం ఏర్పాటైంది. రాష్ట్రీయ మాధ్యమిక శిక్షా అభియాన్ నిధులతో 31లక్షల రూపాయలతో దీనిని నిర్మించారు. గతంలో వున్న పాఠశాల భవనం శిథిలమైపోవడంతో దాని స్థానంలో నూతన భవనాన్ని రెండంతస్తులలో నిర్మించారు. ప్రారంభానికి సిద్ధమైన పాఠశాల నూతన భవనాన్ని ఇంజనీరింగ్ అధికారులు శ్రీనివాసకుమార్, హనుమంతరావు, మాజీ జడ్పీటిసి బీద గిరిధర్ తదితరులు పరిశీలించారు. ఈ సందర్భంగా ఆ ప్రాంత ప్రజలు బీద సోదరుల కృషితో నూతన భవనం ఏర్పాటయ్యిందని అభినందించారు.

# సబ్‌స్టేషన్‌ను ముట్టడించిన ప్రజలు!

రాత్రి సమయాల్లో ఎడాపెడా కరెంటు కోత విధించడాన్ని నిరసిస్తూ రైతులు ట్రాన్స్‌కో ఉపకేంద్రాన్ని ముట్టడించి తాళాలు వేసిన ఘటన బాలాయపల్లిలో చోటుచేసుకుంది. మండలంలో కరెంటు కోతలు తీవ్రతరం అవడంతో గత కొంతకాలంగా రైతులు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. ముఖ్యంగా రాత్రివేళల్లో కరెంటు కోత విధించడం వలన పొలాల్లోకి పోవడానికి ఇబ్బందులు పడుతున్నామని, విషకీటకాలు అధికంగా సంచరిస్తుండడం వలన ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని తిరగాల్సి వస్తోందని రైతులు వాపోతున్నారు. విద్యుత్ కోతలపై ఇటీవల మండలంలోని అలిమిలిగ్రామంలో విద్యుత్ సిబ్బందిని నిర్బంధించిన సంగతి తెలిసిందే. కరవు మండలాలల్లో పర్యటించిన ప్రత్యేకాధికారి అనంతరాముకు కూడా విద్యుత్ కోతల వలన తాము పడుతున్న అవస్థలను తెలియజేశారు. అయినా సమస్య పరిష్కారం కాకపోవడంతో ట్రాన్స్‌కో కార్యాలయాన్ని ముట్టడించారు. మండలంలోని వివిధ ప్రాంతాల నుంచి పెద్ద సంఖ్యలో చేరుకున్న రైతులు అధికారుల తీరుకు నిరసనగా కార్యాలయానికి తాళాలు వేసి అక్కడే ధర్నా నిర్వహించారు. విషయం తెలుసుకున్న ట్రాన్స్‌కో అధికారులు అక్కడకు వచ్చి కోతలపై రైతులకు హామీ ఇవ్వడంతో వారు శాంతించారు.

**సహనం చచ్చిపోయింది.**



## శ్రీలక్ష్మి బెయిల్‌పై విమర్శలు

ఓబులాపురం గనుల కేటాయింపులో ముద్దాయిగా వున్న సీనియర్ ఐఎఎస్ శ్రీలక్ష్మికి బెయిల్ ఇవ్వడంపై విమర్శలు వినవస్తున్నాయి. శ్రీలక్ష్మిని అరెస్ట్ చేసిన 24 గంటలు కూడా కాకముందే ఆమెకు బెయిల్ మంజూరు చేయడం వెనుక పెద్దల ప్రమేయం వున్నట్లు రాజధానిలో చెవులు కొరుక్కుంటున్నారు. అరెస్టుకు ముందు శ్రీలక్ష్మి సిఎం కిరణ్‌ను వ్యక్తిగతంగా కలసి తన గోడును వెళ్లబోసుకుంది. అలాగే ఢిల్లీ నుంచి గల్లీ పెద్దల వరకు శ్రీలక్ష్మి పైరవీలు చేసింది. దీంతో బెయిల్ మంజూరు సులువైందంటున్నారు. ప్రభుత్వం కూడా శ్రీలక్ష్మి విషయంలో ఉదారంగా వ్యవహరిస్తోంది. శ్రీలక్ష్మి అరెస్ట్ కాగానే అర్నెళ్లపాటు ఆమెను సస్పెండ్ చేసింది. అయితే 24 గంటలకు ముందే తాను బెయిల్‌పై బయటకు వచ్చాను కాబట్టి తనకు పోస్టింగ్ ఇవ్వాలంటూ శ్రీలక్ష్మి ప్రభుత్వానికి అర్జీ పెట్టింది. దీంతో చీఫ్ సెక్రటరీ నుంచి సిఎం దాకా స్పందించి వెంటనే సంబంధిత దస్త్రాన్ని సిద్ధం చేశారు. త్వరలోనే శ్రీలక్ష్మి సస్పెన్షన్‌ను రద్దు చేసి తిరిగి పోస్టింగ్ ఇచ్చినా ఆశ్చర్యం లేదంటూ సచివాలయ వర్గాలంటున్నాయి. అయితే శ్రీలక్ష్మి పేరును చార్జ్‌షీటులో చేర్చి, ఆమె బెయిల్‌ను రద్దు చేయించాలని సిబిఐ అధికారులు రంగం సిద్ధం చేస్తున్నారు.






## ప్రభావం చూపని కెవిపి

జగన్ ఎమ్మెల్యేల్ని ఆకర్షించడానికి కాంగ్రెస్ అధిష్టానం కె.వి.పి రామచంద్రరావును రంగంలోకి దించినా పెద్దగా ప్రభావం చూపలేకపోయాడు. శాసనసభలో ప్రభుత్వం అవిశ్వాసం నుంచి బయట పడటానికి నానా తిప్పలు పడింది. అందులో భాగంగానే నిన్నమొన్నటి దాకా తెర మరుగైన కె.వి.పిని తిరిగి బయటకు రప్పించారు. జగన్‌కు మద్దతునిస్తున్న 19 మంది ఎమ్మెల్యేల్లో అతి బలవంతంగా ఇద్దరిని మాత్రం అధికారపక్షం బుట్టలో వేసుకోగలిగింది. మిగిలిన వారికోసం ప్రత్యేక ప్యాకేజీలు ప్రకటించినా, సొంత పనులకు పెద్దపీట వేస్తామన్నా కూడా ఎమ్మెల్యేలు ప్రలోభపడలేదు. పార్టీ విప్‌ను ధిక్కరించి అవిశ్వాస తీర్మానానికి అనుకూలంగా ఓటు వేస్తే ఎమ్మెల్యే పదవిని కోల్పోవడం ఖాయమని తెలిసినా కూడా జగన్ మద్దతుదారులు వెనకాడలేదు. కె.వి.పి ఎంతగా బుజ్జగించినా, బామాలినా కూడా వారు మాత్రం జగన్‌కు అండగా నిలవడం విశేషంగా చెప్పుకుంటున్నారు.



నెల్లూరు మాజీ మేయర్ పులిమి శైలజారెడ్డి కుమార్తె రీతికరెడ్డి, శ్రీకర్‌రెడ్డిల వివాహం 4వతేది అనిల్ గార్డెన్స్‌లో జరిగిన సందర్భంగా నూతన వధూవరులతో బిజెపి జాతీయ నేత ఎం.వెంకయ్యనాయుడు దంపతులు.



## మంత్రివర్గం మార్పుపై సిఎం కసరత్తు

అవిశ్వాసం నుంచి బయటపడ్డాక సిఎం కిరణ్‌రెడ్డి మంత్రివర్గ మార్పుచేర్పులపై దృష్టి పెట్టాడు. ఈ నెలాఖరులోగా ఎలాగైనా ప్రరాపా ఎమ్మెల్యేలకు మంత్రి పదవులు ఇస్తామని కాంగ్రెస్ అధిష్టానం చిరంజీవికి హామీ ఇచ్చింది. ఈ నేపథ్యంలో కిరణ్‌రెడ్డి మంత్రివర్గాన్ని పూర్తిగా ప్రక్షాళన చేయాలనుకుంటున్నాడు. అవిశ్వాసం సందర్భంగా జగన్ ఎమ్మెల్యేలు ఎవరన్నది కూడా వెల్లడి కావడంతో ఇక మంత్రివర్గ మార్పులకు అడ్డం తొలగిపోయిందని కిరణ్ భావిస్తున్నాడు. ప్రస్తుత మంత్రి వర్గంలో తనకు తలనొప్పి కలిగిస్తున్న శంకర్రావు వంటి వారికి ఉద్వాసన చెప్పడానికి కిరణ్ రంగం సిద్ధం చేస్తున్నాడు. ఈ సారి ఏర్పాటయ్యే మంత్రి వర్గంపై తనదైన ముద్ర వేయాలనుకుంటున్నాడు కిరణ్. అయితే కిరణ్‌పై అసంతృప్తిగా వున్న పిసిసి చీఫ్ మాత్రం మంత్రివర్గంలో తన మద్దతుదారులకు పెద్దపీట వేయడానికి ఢిల్లీ నుంచి పావులు కదుపుతున్నాడు. చూద్దాం! ఏమవుతుందో!!



బెంగుళూరులో స్థిరపడ్డ నెల్లూరీయుడు పాటూరు సుబ్బరామిరెడ్డి కుమారుడు సాయిసందీప్‌రెడ్డి, చిత్తూరు మాజీ ఎమ్పీ ఎన్.రామకృష్ణారెడ్డి మనుమరాలు మైనవిరెడ్డిల వివాహం కోలార్‌లోని ఎస్ఎన్ టూరిస్ట్ రిసార్ట్స్‌లో 1తేది జరిగింది.



## 'చిరు'కు మెగా ఆశలు

అసెంబ్లీలో అవిశ్వాసం నుంచి గట్టెక్కడానికి ప్రజారాజ్యం పార్టీ అధినేత చిరంజీవికి అధికారపక్షం చాలా ఆశలు పెట్టింది. కాంగ్రెస్ పార్టీలో విలీనం ప్రకటించాక తమను పట్టించుకోవడం లేదని చిరు ఎమ్మెల్యేలు అసంతృప్తిగా వున్నారు. అవిశ్వాసం సందర్భంగా కాంగ్రెస్‌పార్టీని ఇరకాటంలో పెట్టాలని ఒక దశలో ఎమ్మెల్యేలు చిరంజీవిపై ఒత్తిడి తెచ్చారు. దీనికి 'చిరు' కూడా తలూపాడు. దీంతో అధిష్టానం ఆగ మేఘాల మీద దిగొచ్చి చిరును బుజ్జగించింది. ఒక పక్క ముఖ్యమంత్రి, మరోపక్క పిసిసి చీఫ్ బొత్సా కూడా దాదాపు చిరు కాళ్లుపట్టుకునేంత పని చేశారు. ఇక ఢిల్లీ నుంచి ఆజాద్, అహ్మద్ పటేల్ అయితే గంట గంటకు ఫోన్‌లో చిరుతో మాట్లాడారు. చివరకు ప్రరాపా ఎమ్మెల్యేలకు మంత్రి పదవులు, నియోజక వర్గాల్లో కోరుకున్న పనులు మంజూరు చేయడానికి అధికార పక్షం అంగీకరించింది. గతంలో రెండు మూడు మంత్రి పదవులిస్తామన్న సిఎం ఇప్పుడు మరో రెండు పదవుల్ని కూడా అధికంగా ఇవ్వడానికి అంగీకరించినట్లు భోగట్టా.



రొట్టెల పండగను పురస్కరించుకొని నెల్లూరు చెరువు వద్ద రొట్టెలు మార్చుకొంటున్న మహిళలు.

# ధనుర్మాసానికి గోదాదేవికి విడదీయలేని బంధం!



భక్తవత్సలుడైన శ్రీమహా విష్ణువుకు అత్యంత ప్రీతికరమైన మాసం ధనుర్మాసం. మాసాల్లోకెల్లా మార్గశిరం ఉత్తమోత్తమమైనది. డిసెంబర్ నెల మధ్యలో సూర్య భగవానుడు వృశ్చిక రాశి నుంచి ధనురాశిలోకి ప్రవేశించి మకర రాశిలోకి వెళ్లే వరకు వున్న కాలాన్ని ధనుర్మాసంగా పిలుస్తారు. ధనస్సు అనే పదానికి ధర్మం అనే అర్థం వుంది. ధర్మాన్ని పాటించే మాసం కాబట్టి ఆ పేరొచ్చిందని అంటారు. మృగశిర నక్షత్రంతో కూడిన పూర్ణిమ గల మాసంగా ధనుర్మాసాన్ని చెప్తారు. భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు మాసాల్లోకెల్లా మార్గశిర మాసం ప్రీతికరమైనదిగా చెప్తాడు. మార్గం అంటే దారి, ఉపాయము అని, శీర్షం అంటే ముఖ్యమైనదని అర్థం వుంది. అంటే భగవంతుని అనుగ్రహం పొందేందుకు చూపించే మార్గం ధనుర్మాసం.

ధనుర్మాసానికి, గోదాదేవికి విడదీయలేని బంధం వుంది. శ్రీరంగనాథుడిని మనోరథునిగా భావించిన పరమభక్తురాలైన గోదాదేవి ప్రేమ – ఆరాధనతో స్వామిని తన స్వామిగా చేసుకొన్న ప్రేమమూర్తి. కలియుగం ప్రారంభంలో భూదేవి అంశతో జన్మించిన గోదాదేవి మార్గశిర మాసంలో శ్రీరంగని కోసం ముప్పై పాశురాలను స్వయంగా రచించి గానం చేసింది. వీటిని తిరుప్పావై అంటారు. తిరు అంటే మంగళకరం, పావై అనగా కొలువు అని అర్థం. మంగళకరమైన కొలువు అని దీని భావం. ఈ పాశురాలను నెలరోజులపాటు రోజుకొకటి చొప్పున వైష్ణవాలయాలలో సుప్రభాతం బదులు గానం చేస్తారు. ఈ పాశురాలు వేదమంత్రాలతో సమానమైన స్థాయిని పొందాయి. వేదాంతపరమైన రహస్యాలు ఎన్నో పాశురాలలో మిళితమై వున్నాయి. పెరుమాళ్లను భర్తగా పొందగోరిన గోదాదేవి స్వామిపై తనకున్న భక్తిని, తన అంతరంగాన్ని ఈ పాశురాలలో నివేదించింది. భక్తి ఆరాధనే కాకుండా ప్రేమ మార్గం ద్వారా ఆ పరంధాముడిని చేరుకోవచ్చని నిరూపించిన భక్తురాలు, ప్రేమమూర్తి గోదాదేవి. శ్రీరంగనాథుడి కోసం గోదాదేవి ఆచరించిన వ్రతమే ధనుర్మాస వ్రతం అంటారు. దీనిని ద్వాపరయుగంలో రేపల్లెలో గోపికలు శ్రీకృష్ణుని పొందేందుకు కాత్యాయని వ్రతం పేరుతో ఆచరించారట. కలియుగంలో గోదాదేవి ధనుర్మాస వ్రతం చేసిన ఆద్యురాలుగా చెప్తారు. గో అనే శబ్దానికి జ్ఞానం అని, ద అంటే ఇచ్చేది అని అర్థం. ఈ నెలలో ఆమె పెరుమాళ్లను అర్చిస్తూ భక్తితో తులసి, ఇతర పూలతో మాలను కట్టి ముందుగా తాను ధరించి తర్వాతే స్వామికి ఇచ్చేదట. అందుకే ఆమెకు ఆముక్తమాల్యద అని పేరొచ్చిందని పురాణాలు చెప్తున్నాయి. క్షీర సాగరంలో వున్న శ్రియపతి పాదాలను భక్తితో శరణాగతి చేస్తూ రంగడిలో ఐక్యం అయిన పరమభక్తురాలు గోదాదేవి. శ్రీకృష్ణుని గొప్పతనాన్ని గోపికలతో చర్చించడం ఈ పాశురాల విశేషం.

డిసెంబరు 17తేది నుండి ధనుర్మాసం ప్రారంభం.






## ట్రంకురోడ్డు

### కొండవీటి చాంతాడంత కమిటీ!



నెల్లూరు బారాషహీద్ దర్గా వద్ద జరిగే రొట్టెల పండుగ గూర్చి అందరికీ తెలిసిందే. ఇక్కడ ఈ వేడుకను పురస్కరించుకొని అవసరమైన ఏర్పాట్లను వివిధ ప్రభుత్వశాఖలు చూస్తాయి. ఉత్సవ కమిటీని కొందరు మైనారిటీ సోదరులతో ఏర్పాటు చేయడం ఆనవాయితీ. రాజకీయ నేతలు ఈ కమిటీ ఏర్పాటులో జోక్యం చేసుకోవడంతో ఈసారి సభ్యుల జాబితా కొండవీటి చాంతాడంతయ్యింది. మొత్తం మీద 220 మందికి ఈ ఉత్సవ కమిటీలో చోటు కల్పించారు. అధ్యక్షునితోపాటు 16 మంది ఉపాధ్యక్షులు, 19 మంది సంయుక్త కార్యదర్శులు, 24మంది నిర్వహణ కార్యదర్శులు, సభ్యులుగా మిగతావారి పేర్లు ప్రకటించారు. వీరంతా ఒక్కసారి దర్గాలోనికి వెళ్తే చాలు భక్తులకు ఇక దర్శనం దుర్లభం. కేవలం నాలుగురోజులు పని చేసే నామమాత్రపు ఈ కమిటీలో ఇందరికి చోటు కల్పించడంపై విమర్శలు వెల్లువెత్తుతున్నాయి.

### హమ్మా... వివేకా!



నోటికొచ్చినట్లు మాట్లాడడంలో నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి తరువాత నేనని చెప్పొచ్చు. నగరంలోని వైఎంసిఏ గ్రౌండ్‌ను పిఆర్ విద్యాసంస్థలు కొన్నాయి. ఇక్కడ విద్యాసంస్థల పరిపాలనా భవనమంటూ పెద్ద నిర్మాణమే చేస్తున్నారు. ఈ నిర్మాణం ముందు ఏసుక్రీస్తు ప్రభువు విగ్రహావిష్కరణకు వివేకా పూనుకోవడం పెద్ద ఎత్తున విమర్శలు రేగాయి. కాని జిల్లాలోని ఏ ఉన్నతాధికారి ఈ వ్యవహారాన్ని విచారించే యత్నం చేయలేదు. 3తేది ఈ విగ్రహాన్ని ఆవిష్కరించిన వివేకానందరెడ్డి ఏసుక్రీస్తు ప్రభువు తనకు కలలో కనపడి ఈ పని చేయమని చెప్పబట్టే చేశానని తెగించి మరీ చెప్పారు. కరుణామయుడు వివేకానందరెడ్డి వంటి వారికి కలలో నిజంగా కనపడి వుంటే అది కలికాలపు మాయే ననుకోవాలి.




### డర్టీ వాల్ పోస్టర్లు

ఈ మధ్య కాలంలో అందరి నోళ్లలో నానిన చిత్రం డర్టీ పిక్చర్. ఈ సినిమా తీస్తున్నామని నిర్మాత ఏక్తాకపూర్ ప్రకటించినప్పటి నుంచి ఏదో రూపంలో వివాదాలు సృష్టిస్తూనే వుంది. 1980 దశకంలో దక్షిణాది సినిమా పరిశ్రమను సెక్సీ నటిగా ఏలిన స్మిల్ స్మిత వాస్తవ జీవితగాథ ఈ సినిమాకు ఆధారమని ప్రకటించినప్పటి నుండీ, ఒకవైపు ఆసక్తినీ, మరోవైపు ఆక్షేపణలను సృష్టించింది. ఇంతకు చెప్పొచ్చేదేమిటంటే ఈ వారంలో విడుదలైన ఈ సినిమా వాల్ పోస్టర్లు శృతిమించిన అశ్లీలంతో ఉన్నాయి. నటి విద్యాబాలన్ దేహ ప్రదర్శనతో కూడిన ఈ పోస్టర్లు నగరమంతా దర్శనమిస్తున్నాయి. సెన్సార్ అధికారులు తెగించి ఇచ్చిన అనుమతి, మహిళా సంఘాలలో పోరాటపటిమ తగ్గి విచ్చలవిడిగా దర్శనమిస్తున్న డర్టీ వాల్ పోస్టర్లపై ట్రంకురోడ్డులో తెగ చర్చ జరుగుతోంది.

### ఒంటరి పోరాటం

జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారిగా జిల్లాలో చిన్న పిల్లల వైద్యునిగా పేరుగాంచిన మాశిలామణి బాధ్యతలు తీసుకొన్నారు. డాక్టర్ గారు గాడి తప్పిన వైద్య ఆరోగ్య శాఖను సక్రమ మార్గంలో నడిపించను ప్రయత్నాలు మొదలెట్టారు. వైద్య ఆరోగ్యశాఖ పరిధిలోనికి వచ్చే అన్ని పిహెచ్‌సిలు, పెద్దాస్పత్రుల తనిఖీలకు పూనుకొన్నారు. విధులకు గైర్హాజరవుతున్న డాక్టర్లు, పారా మెడికల్ సిబ్బందికి మెమోలిచ్చారు. విధి నిర్వహణలో అలసత్వం తగదని గట్టిగా మాట్లాడుతున్నారు. డిఎంఅండ్‌హెచ్‌ఓ ఎంత గొంతు చించుకొన్నా, సస్పెన్షన్లు చేసినా వైద్య సిబ్బందిలో నామమాత్రపు మార్పు కన్పించకపోవడంపై ట్రంకురోడ్డులో తెగచర్చ జరుగుతుంది.

### పోలీసులా... మజాకా!

నెల్లూరు పోలీసులు మహాముదుర్లు. టీచర్ల మాదిరి వీరు చేయని సైడు బిజినెస్ లేదు. కాని ఈ బిజినెస్‌లలో సంఘ విద్రోహ కార్యకలాపాలు ఎక్కువయ్యాయి. దొంగలకు సహకారం, వ్యభిచారం, ఎర్రచందనం స్మగ్లింగ్, సివిల్ పంచాయితీలు చాలవన్నట్లు ఈ మధ్య మనీ సర్కులేషన్ స్కీమ్‌లో బినామీ ఏజంట్లుగా వ్యవహరించారు. కోట్లు కొల్లగొట్టారు. ఈ విషయమై సిఐడి విచారణ చేస్తోంది. ఇది చాలదంటూ త్రీటౌన్ కానిస్టేబుల్ ఒకరు చీటీల పేరిట మూలాపేటవాసులకు కోటి రూపాయల మేర నెత్తిన టోపీ పెట్టారు. మిగతా సంగతులన్నీ ప్రక్కనపెట్టి పోలీసుల్లో మార్పుకు ఎస్పీ కార్యాచరణను సిద్ధం చేయాల్సిన పరిస్థితి నేడుంది.


మేషం
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వస్త్రాభరణాలు కొంటారు. విదేశీ ప్రయాణావకాశాలు కానవస్తున్నాయి. గృహనిర్మాణ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మిత్రులు సాయమందిస్తారు. కుటుంబంలో సమస్యలు తీరుతాయి. రాజకీయులకు మేలైన కాలం. కళాకారుల ప్రతిష్ఠ పెరుగుతుంది. విద్యార్థులకు యోగకాలం. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి.


వృషభం
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. తోటివారు సాయమందిస్తారు. నూతనమిత్రులు ఏర్పడతారు. విదేశీ ప్రయాణావకాశాలు కానవస్తున్నాయి. గృహనిర్మాణ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. వ్యాపార వృద్ధి చక్కగా సాగుతుంది. కొత్త భాగస్వామి లేదా మంచి అనుచరులు లభిస్తారు. విద్యార్థులకు యోగకాలం. ఉద్యోగినులకు చాలా ప్రయోజనవంతమైన కాలం.


మిథునం
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు1,2,3 పా

జీవితభాగస్వామి బంధువులతో గొడవలుండవచ్చు. తల్లి అనారోగ్యం చింతనిస్తుంది. వృత్తిలో మార్పు చేర్పులుండవచ్చు. వ్యాపారులకు కొంతవరకు మేలు. పోటీలెక్కువ. భాగస్వాములతో జాగ్రత్త. దైనందిన కార్యక్రమాలలో ఆటంకాలుండవచ్చు. విద్యార్థులకు చదువు సాగదు. కళాకారులకు ఆశాభంగం. ఉద్యోగులకు శ్రమ తగ్గుముఖం పడుతుంది. జ్వరాదుల పీడ అలర్జీ బాధలుంటాయి.


కర్కాటకం
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

ఆరోగ్యవిషయంలో ఒత్తిడి వల్ల ఇబ్బందులు. వృత్తిరీత్యా ఉత్సాహం అధికమవుతుంది. కళత్ర సుఖం చక్కగా వుంటుంది. గృహిణులకు ఇరుగు పొరుగువారితో సత్సంబంధాలుంటాయి. సంతానమూలంగా సుఖ శాంతులు లోపిస్తాయి. ధన విషయంలో లోటుండదు. భవిష్యత్తుకు మంచి పథకాలు వేస్తారు. రాజకీయులకు అత్యంత అనుకూలమైన కాలం. వ్యాపార విస్తరణ చేస్తారు. విద్యార్థులకు మంచికాలం.


సింహం
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

ఆర్థిక లావాదేవీలు మీకనుకూలంగా వున్నా స్పెక్యులేషన్ జోలికి పోవద్దు. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. పెద్దలతో గొడవలు రావచ్చు. పిల్లల అనారోగ్యం వేదనకు గురి చేస్తుంది. తప్పనిసరిగా కొన్ని గృహోపకరణాలు కొనవలసి వస్తుంది. భాగస్వాములు మోసగించే అవకాశాలున్నాయి. ఉద్యోగులకు, రాజకీయులకు ప్రోత్సాహం తక్కువ. గృహిణులకు ఋతుసంబంధిత బాధలుంటాయి.


కన్య
ఉత్తర 2,3,4పా. హస్త, చిత్త 1, 2 పా

స్పెక్యులేషన్ మంచిది కాదు. ఆర్థిక విషయాల కటకట వుంటుంది. నూతన వస్త్రాభరణాలు కొంటారు. గృహాలంకరణ విషయాలలో ఆసక్తి చూపుతారు. ఖర్చుకు వెరవరు. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం. అన్ని రంగాలలో ముందంజ వేస్తారు. వ్యాపారులు అధికంగా కష్టపడాలి. రాజకీయులు పైవారి ఆదరణకు పాత్రులవుతారు. ఉద్యోగులకు పెద్దల తోడుంటుంది.

# వారఫలాలు

*తేది 10-12-2011 నుండి 16-12-2011 వరకు ధనుర్మకరాలలో రవి, బుధ, శుక్రులు; మేషంలో గురువు; సింహంలో కుజుడు; తులలో శని; వృశ్చికంలో రాహువు; వృషభంలో కేతువు; వృషభ, మిథున, కర్కాటకాల్లో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

10తేదీ చంద్ర గ్రహణం. సాయంత్రం 06.15 నుండి 09.50 గంటల వరకు. వృషభ, మిథున, తుల, కుంభ రాశుల వారు దోష శాంతులు చేసుకోవాలి.

15తేది పొట్టిశ్రీరాములు వర్ధంతి.

**శుభ ముహూర్తాలు లేవు.**

**డిసెంబర్ తిథులు**

**మార్గశిర శుద్ధ**

| | | | |
|---|---|---|---|
| 10 | శని | పౌర్ణమి | రా 07.22 గం.ల.వ |

**మార్గశిర బహుళ**

| | | | |
|---|---|---|---|
| 11 | ఆది | పాడ్యమి | రా 08.35 గం.ల.వ |
| 12 | సోమ | విదియ | రా 09.15 గం.ల.వ |
| 13 | మంగళ | తదియ | రా 09.16 గం.ల.వ |
| 14 | బుధ | చవితి | రా 08.52 గం.ల.వ |
| 15 | గురు | పంచమి | రా 07.51 గం.ల.వ |
| 16 | శుక్ర | షష్ఠి | రా 06.39 గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com


తుల
చిత్త 3,4 పా. స్వాతి, విశాఖ 1,2,3 పా

వ్యాపారులు కొత్తసంబంధాలు ఏర్పరచుకొంటారు. రాజకీయులకు ప్రోత్సాహకరమైన కాలం. కంటికి, ఊపిరితిత్తులకు సంబంధించి ఇబ్బందులుండవచ్చు. కళత్రసంబంధం చక్కగా వుంటుంది. పెద్దల సాయంతో ఉద్యోగవృద్ధి, వేతనవృద్ధి వుంటుంది. బంధువులకు మీ చేతనైన సహాయం చేస్తారు. వృత్తిపరులకు కళాకారులకు మంచి ఆదరణ. విద్యార్థులకు చదువుచక్కగా సాగకపోవచ్చు.


వృశ్చికం
విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ

కుటుంబసభ్యుల తోడ్పాటు చక్కగా వుంటుంది. ఉద్యోగులకు పై అధికారుల సాయం చక్కగా లభిస్తుంది. విద్యార్థులు ఉత్సాహంతో ఉరకలేస్తారు అనవసర విషయాలలో జోక్యం చేసుకోకుండడం మంచిది. ఆర్థిక విషయాలు కొంత తృప్తికరంగా వుంటాయి. వ్యాపారులు భాగస్వాములతో సఖ్యంగా వుండడానికి ప్రయత్నించండి. ఆర్థికలావాదేవీలలో జాగ్రత్త. రాజకీయులు తోటివారితో జాగ్రత్తగా వుండాలి.


ధనుస్సు
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

గృహిణులకు సంతానమూలంగా మనశ్శాంతి వుండదు. కుటుంబ సభ్యుల నుండి సహాయ సహకారాలుండవు. ఊహించనిరీతిలో ధన వ్యయమవుతుంది. ఎంత పొదుపు చేయాలనుకున్నా వీలుకాదు. ఇష్టులైన వారికిగాను ఖర్చు అవవచ్చు. గృహనిర్మాణం లేదా వసతి గృహోన్ని అమ్మడమనే పనులలో నిమగ్నమవుతారు. వ్యాపారులకు, వృత్తిపరులకు మేలైన కాలం గాదు. పాదాలు రుగ్నాలవుతాయి.


మకరం
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

ధనవిషయంలో కటకట వుండవచ్చు. ఖర్చులధికం. పొదుపు ధనం వృథా అవుతుంది. పనులు నిదానంగా సాగవచ్చు. ఒకటికి రెండు సార్లు ఆలోచించి చేయడం మంచిది. వ్యాపారులకు అమ్మకాలు తగ్గు ముఖం పడతాయి. ఉద్యోగులకు అతికష్టంగా సాగుతుంది. విద్యార్థులకు ఒకవిధంగా చదువు సాగుతుంది. రాజకీయులకు దురదృష్టకాలం. ఉద్యోగినులకు మంచి సమయంకాదు.


కుంభం
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

భాగస్వాములు మోసగించే అవకాశాలున్నాయి. వ్యాపారులకు పోటీ లధికం. దీర్ఘరోగులకు ఇబ్బందులుండవచ్చు. కళత్రంతో గొడవలుండవచ్చు. కళత్ర బంధువులు దానికి కారణమవవచ్చు. ధన విషయాలలో లోటు లేదు. రుణరూపంలో కూడ ధనప్రాప్తి. పాదాలకు గాయాలు తగిలే అవకాశం. ఉద్యోగులకు ప్రమోషన్ లేదా ఆదాయవృద్ధి వుండవచ్చు. రాజకీయులకు ఉత్తమకాలం.


మీనం
పూర్వాభాద్ర 4 పా. ఉత్తరాభాద్ర, రేవతి

వ్యాపారులు ఖాతాదారులతో జాగ్రత్తగా మెలగాలి. పేగులకు సంబంధించిన బాధలధికం. సంతానమూలంగా మానసిక వేదనకు గురౌతారు. దైవానుగ్రహానికి ప్రయత్నం చేయండి. ధన విషయంలో తండ్రి సోదరులతో ఇబ్బందులు రావచ్చు. గుట్టుగా కాలం గడపడం మంచిది. ఆర్థిక విషయాలంతంత మాత్రమే. ఇరుగు పొరుగు వారి సహాయమందవచ్చు. ఎదురు చూసిన సత్ఫలితాలు దక్కవు.

# వేధో దోషాల వల్ల ఆర్థిక, అనారోగ్య పరిస్థితులు!

*పిరాట్ల శారదాంబ — కావలి*

* *దృష్టి దోషాన్ని గురించి చెప్పండి?*

గృహానికి ఎదురు రోడ్డు. గేటు సింహద్వార ప్రతిష్ఠల్లోని లోపాలు దృష్టి దోషాన్ని కలుగజేస్తాయి. ఈ వేధో దోషాల వల్ల ఆర్థిక, అనారోగ్య పరిస్థితులు వేధిస్తాయి.

*పి.సరోజిని — హైదరాబాద్*

* *అబ్బాయి అప్రయోజకుడయ్యాడు. కోడలు పుట్టింటికి వెళ్లిపోయింది. వీళ్లని కలపడం ఎట్లా?*

జీవితం ఆర్థిక అంశాలతో కూడి ఉన్నప్పుడు అబ్బాయి సోమరి అయితే పరిస్థితి ఎక్కడైనా ఇంతే. అబ్బాయికి 'పుష్యరాగ' రత్నధారణచేసి, యంత్రాన్ని నిర్ధారించుకొని ప్రతిష్టించుకోండి.

*షేక్ ఖాదర్‌వలి — నెల్లూరు*

* *సెప్టిక్ ట్యాంకులు మూలల్లో ఉంటే సమస్య ఏమిటి?*

మూలల్లో అగాధాలు ఏర్పడి దిక్కులు భ్రష్ఠమవుతాయి. ఈశాన్యం సర్వనాశనం, వాయువ్యం మానసిక వేధనం, ఆగ్నేయం స్త్రీవ్యాధి, నైరుతి రోగ, మరణం అని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి.

*పి.దశరథరామయ్య — బెంగుళూరు*

* *గృహం ముందు రెండు కిటికీలు వుండాలా?*

కిటికీలు, ద్వారాలు కళ్లతో సమానం. రెండు కిటికీలు వీలులేని పక్షంలో ద్వారం, కిటికీ అయినా తప్పక వుండాలి. అలా వుండకపోతే అంధక వేధ ఏర్పడుతుంది.

*ఎన్.శ్రీలక్ష్మి — చిత్తూరు*

* *అందరికీ చిడిముడి పరిస్థితి ఏమి చేయమంటారు?*

గృహం దిక్కు ప్లాను దోషాలు మీ నక్షత్రాలు ఇచ్చి యంత్ర నిర్ణయం చేసుకొని ప్రతిష్ఠించుకోండి. ఇంట్లో సమస్యలు తగ్గుతాయి.

*ఎన్.వి.ఆర్.మురుగేశన్ — చెన్నై*

* *ఫ్యాక్టరీలో ఈశాన్యంలో గేటు ప్రక్కన వినాయకుడి గుడి కట్టాక ఆవిడికి యాక్సిడెంట్ అయ్యింది.*

గృహాల్లో ఈశాన్యంలో దేవుడి గది, అది ఇంటిలోపలే. మీరు బయట కట్టారు. పూచికపుల్ల బరువు కూడా అక్కడ వుండకూడదు. పైగా 'గణపతి' వీధివైపు వుండకూడదు.

*ఎన్.సుశీలాదేశాయ్ — గుంటూరు*

* *అబ్బాయికి జ్ఞాపకశక్తి తక్కువ. ఎంత చదివినా మార్కులు రావడం లేదు.*

దేవుడి గదిలో స్వాతి నక్షత్ర యుక్తమైన యంత్రాన్ని నిర్ణయించిన తర్వాత ప్రతిష్టించుకోండి. అలాగే రత్నధారణ కూడా చేయించండి. ఫలితం వుంటుంది.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*నెల్లూరు ఉమాదేవి — నెల్లూరు*

* *అబ్బాయికి పెళ్లి, ఉద్యోగం చాలా ఆలస్యం అవుతున్నాయి. పరిష్కారం ఏమిటి?*

ఇంట్లో తూర్పు, పశ్చిమ దోషాలున్నాయి. వాటిని నివృత్తి చేసుకొని 'సుదర్శన యంత్ర' ప్రతిష్ఠ దేవుడి గదిలో చేయండి. మంచి జరుగుతుంది.

*యం.శేషప్రసన్న — సూళ్లూరుపేట*

* *గృహ కార్యక్రమాల్లో వాడే తమలపాకు విషమనీ, అమృతమనీ రెండు రకాలుగా చెప్పారు ఎందువల్ల?*

వశిష్ఠ మహర్షి ఇలా అంటారు. తమలపాకు తొడిమను, చివరల్ని, ఈనెల్ని తీసివేసి తినాలి. తొలిరసాన్ని మ్రింగకూడదు. అది విషమట. మలిరసం విరోచనకారి, చివరి రసం అమృత తుల్యము. అందులో 'ఆయుర్వేద త్రిగుణాత్మక' గుణాల్ని గురించిన వర్ణన కూడా ఉంది.

*వి.ఎన్.సత్యం — చిత్తూరు*

* *ఈశాన్యం పడగ్గదులుంటే ఏమౌతుంది?*

పూజా గది స్థానం కాబట్టి దిక్కు భ్రష్ఠమవుతుంది. అనారోగ్య హేతువవుతుంది. భార్యావిధేయులై హేళనకు గురి అవుతారు.

*సంపత్కుమారాచార్య — హైదరాబాద్*

* *గణేశుడి చేతిలోని 'మోదకం' దేనికి ప్రతీక!*

మానవుల కృషి, సాధనలకు లభించిన ఫలితం లేక పురస్కారానికి మోదకం(లడ్డు) ప్రతీకగా 'పూజా పుష్పకం' విశ్లేషిస్తున్నది.

# పుష్కరం తర్వాత మందుల షాపులపై దాడులు!

**మందుల షాపుల నిర్వహణకు బి-ఫార్మసీ కనీస అర్హత. ఆ అర్హత కల్గినవారు ఒక్కరూ షాపుల్లో లేరు. ఈ విషయం పుష్కరం తర్వాత గ్రహించిన డ్రగ్ కంట్రోల్ అధికారులు దాడులకు దిగారు. అయినా పరిస్థితుల్లో మార్పు కానరావడం లేదు.**

**జిల్లావ్యాప్తంగా మందుల దుకాణాలపై దాడులు నిర్వహించారు డ్రగ్ కంట్రోల్ అధికారులు. నిబంధనలకు విరుద్ధంగా దుకాణాలలో మందులు విక్రయిస్తున్న నిర్వాహకులను గుర్తించి చర్యలు తీసుకునేందుకు రంగం సిద్ధం చేశారు. మందుల దుకాణాలు ఏర్పాటు చేయాలంటే బిఫార్మసీ కోర్సు చేసి ఉండాలి. ఈ అర్హత కలిగినవారే లైసెన్స్ కోసం డ్రగ్ కంట్రోల్ అధికారులకు ధరఖాస్తు చేయాల్సి ఉంటుంది. లైసెన్స్ మంజూరుచేసిన అనంతరం ఫార్మాసిస్టులే వైద్యుల ప్రిస్క్రిప్షన్ ఆధారంగా మందులు విక్రయించాల్సి ఉంటుంది. జిల్లావ్యాప్తంగా ఫార్మాసిస్టుల పేరుతో లైసెన్స్ పొంది ఎటువంటి అనుభవంలేని వారిని నియమించి మందులు విక్రయిస్తున్నారు.**

ఈతంతు అనేక సంవత్సరాల నుంచి జరుగుతున్న సంగతి తెలిసిందే. కొన్ని సందర్భాలలో వైద్యుల సలహా లేకుండానే మందులు విక్రయిస్తుంటారు. ఈ క్రమంలో వాడిన మందులు వికటించి ప్రాణాలు పోగొట్టుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంటుంది. మందుల దుకాణాల నిర్వాహకులు ప్రభుత్వ నిబంధనలు పాటించడం లేదన్న దానిపై ప్రభుత్వానికి అనేక ఫిర్యాదులు వెళ్తున్నాయి. వీటిపై స్పందించిన రాష్ట్రస్థాయి అధికారులు మందుల దుకాణాలపై దాడులు, తనిఖీలు చేయాలని ఆదేశాలు జారీ చేశారు. నెల్లూరు నగరంతోపాటు కావలి, గూడూరు, నాయుడుపేట, ఆత్మకూరు, సూళ్లూరు పేట తదితర ప్రాంతాల్లోని మందుల దుకాణాలపై దాడులు జరిపారు.

ఫార్మాసిస్టులు లేకుండానే నిర్వాహకులు మందులు విక్రయిస్తున్న విషయాన్ని గుర్తించారు. కొన్ని మందుల దుకాణాల్లో 18 సంవత్సరాలు కూడా నిండని వారిని నియమించి మందులు విక్రయించడాన్ని చూసి డ్రగ్ కంట్రోల్ అధికారులు ఆశ్చర్యపోవాల్సి వచ్చింది. నాయుడుపేట, ఆత్మకూరు ప్రాంతాల్లో మరికొన్ని మందుల దుకాణాలు లైసెన్స్ రెన్యువల్ చేయించుకోకపోవడం బయట పడింది. ఒక్కసారిగా డ్రగ్ కంట్రోల్ అధికారులు మందుల దుకాణాలపై దాడులు చేయడంతో కొందరు దుకాణాలు మూసివేయడం కనిపించింది. దుకాణాల తనిఖీల్లో నిషేధిత మందులను కొన్నింటిని కనుగొన్నారు. మందుల కంపెనీలు వైద్యులకు ఉచితంగా అందించే పలు రకాల శ్యాంపిల్ మందులను విక్రయానికి సిద్ధంగాఉంచడాన్ని గుర్తించి వాటిని స్వాధీనం చేసుకున్నారు.

కొందరు వ్యాపారులు ఒక పేరుతో లైసెన్స్ పొంది మరొక పేరుతో మందులు విక్రయిస్తున్నారు. కిరాణా దుకాణాలు, ఫ్యాన్సీ షాపుల్లో మందులు నిల్వచేసి విక్రయాలు జరుపుతున్న విషయాన్ని అధికారులు సీరియస్‌గా పరిగణిస్తున్నారు. అడ్డూఅదుపు లేకుండా మందులను ఇష్టానుసారంగా రోగులకు విక్రయించడం నేరం. గ్రామీణ ప్రాంతాలకు చెందిన వారు మండల కేంద్రాల్లో ఏర్పాటుచేసిన మందుల దుకాణాల నుంచి వైద్యుల సలహా లేకుండానే మందులు కొనుగోలు చేస్తుంటారు. ఈ క్రమంలో ఒక మందుకు బదులు మరో మందును అందజేయడం వలన లేని రోగాలను కొని తెచ్చుకొనే ప్రమాదం ఉంది. మందులు విక్రయించిన దుకాణదారులు వికటించిన సమయంలో తమకు ఏ మాత్రం సంబంధం లేదని తప్పించుకుంటున్నారు.

ఎటువంటి రశీదులు లేకపోవడం వలన బాధితులు ఏమీ చేయలేని పరిస్థితి. డ్రగ్ కంట్రోల్ అధికారులు తరచూ మందుల దుకాణాల తనిఖీలు చేస్తే అక్రమాలకు తావు లేకుండా పోతుంది. అలా కాకుండా ఎప్పుడో పై అధికారుల నుంచి కఠినమైన ఆదేశాలు అందినప్పుడు దాడులు చేస్తే ప్రజలకు మాత్రం ఏమీ ప్రయోజనం ఉండదు. J

ఉత్తుత్తి పథకం

# భూస్వాముల చేతుల్లో గిరిజనుల భూములు!

**జిల్లాలో గిరిజనులకు ప్రభుత్వం పంపిణీ చేసినట్లు చెబుతున్న భూములు భూస్వాముల చేతుల్లోనే వున్నాయి. వీటిని తమకు స్వాధీనం చేయమని గిరిజనులు రెవిన్యూ కార్యాలయాల చుట్టూ తిరుగుతున్నా ప్రయోజనం లేకుండా పోయింది.**

పేద ప్రజలకు ప్రభుత్వం పంపిణీ చేసిన భూములు నేటికీ భూస్వాముల చేతుల్లోనే ఉన్నాయి. రెవిన్యూ అధికారులు భూములు పంపిణీ చేసినట్లు రికార్డుల్లో నమోదుచేసి చేతులు దులుపుకొంటున్నారు. ప్రభుత్వం కేటాయించిన భూముల్ని సర్వేచేసి లబ్దిదారులకు స్వాధీనం చేయడం లేదు. రెవిన్యూ అధి కారుల నిర్లక్ష్యం కారణంగా లబ్దిదారులు భూముల్ని అనుభవించలేక పోతున్నారు. దీంతో తిరిగి భూస్వాముల చేతుల్లోకి వెళ్తున్నాయి. ప్రభుత్వం పంపిణీ చేసిన భూముల హద్దులు చూపించి స్వాధీనం చేయాలని మండల తహశీల్దార్ కార్యాలయం చుట్టూ తిరుగుతున్నా అధికారులు స్పందించకుండా కాలయాపన చేస్తున్నారు. జిల్లాలో ఐదు విడతలుగా పంపిణీ చేసిన భూముల పరిస్థితి అన్ని మండలాల్లోనూ ఇదే విధంగా వుంది.

ప్రతి సోమవారం జిల్లా కలెక్టరేట్‌లో నిర్వహించే ప్రజావిజ్ఞప్తుల కార్యక్రమానికి హాజరై భూముల ఆక్రమణలపై అధిక సంఖ్యలో వినతి పత్రాలు సమర్పిస్తున్నారు ప్రజలు. వీటిని త్వరిత గతిన పరిష్కరించాలని కలెక్టర్ మండల తహశీల్దార్లను పదే పదే ఆదేశిస్తున్నా ఎవరు కూడా చర్యలు తీసుకొనేందుకు ముందుకు రావడం లేదు. ఫలితంగా రోజు రోజుకు ఫిర్యాదులు అధికమవుతున్నాయి. రెవిన్యూ అధికారుల నిర్లక్ష్యానికి ఉదాహరణగా ముత్తుకూరు మండల తహశీల్దార్ కార్యాలయాన్ని పేర్కొనవచ్చు. ఈ మండలంలోని బ్రహ్మదేవం గ్రామ రెవిన్యూ పరిధిలో 2005 సంవత్సరంలో 15 ఎకరాల భూమిని గిరిజనులకు పంపిణీ చేయడం జరిగింది. భూములు పంపిణీ చేసినట్లు రికార్డుల్లో పేర్కొన్నారే తప్ప భూములను మాత్రం గిరిజనులకు స్వాధీనం చేయలేదు.

గత ఐదు సంవత్సరాల నుంచి ముత్తుకూరు తహశీల్దార్ కార్యాలయం చుట్టూ తిరిగినా కూడా పట్టించుకునే దిక్కు లేకుండా పోయారు. ఈ క్రమంలో గిరిజనులకు పంపిణీ చేసిన భూముల్ని కొందరు భూస్వాములు ఆక్రమించుకొని తమ ఆధీనంలో వుంచుకున్నారు. భూములు ఆక్రమణకు గురి కావడంపై ఆందోళన చెందిన గిరిజనులు జిల్లా కలెక్టర్‌ను కలిసి తమ సమస్యను విన్నవించుకున్నారు. స్పందించిన కలెక్టర్ భూముల్ని సర్వేచేసి గిరిజనులకు స్వాధీనం చేయాలని తహశీల్దార్‌ను ఆదేశించారు. కలెక్టర్ ఆదేశాలతో సర్వేయర్‌ను పంపించి సర్వే చేయించడం జరిగింది. భూములు చేజారి పోతున్నాయని భావించిన భూస్వాములు తమ దగ్గర పనిచేసే కూలీల చేత గిరిజనులకు మద్దతుగా నిలచిన ప్రజాసంఘాల నేతలపై పోలీసులకు ఫిర్యాదు చేయించారు.

## ఎస్ఐ అత్యుత్సాహం

భూస్వాముల దగ్గర పనిచేసే పాలేరు ఇచ్చిన ఫిర్యాదును సమగ్రంగా పరిశీలించి విచారించాల్సిన ముత్తుకూరు ఎస్ఐ కొంత అత్యుత్సాహం ప్రదర్శించినట్లు కనిపిస్తుంది. ఫిర్యాదు అందిన వెంటనే గిరిజనులకు మద్దతుగా వున్న వారిని స్టేషన్‌కు పిలిపించి అసభ్యకరమైన పదాలతో దూషించాడని చెప్పారు. గిరిజనులకు పంపిణీ చేసిన భూములను ఆక్రమించిన వారిని మందలించాల్సిన ఎస్ఐ వారికే అండగా నిలచి ప్రజా సంఘాల నేతలపై కేసులు నమోదు చేస్తానని బెదిరించాడట. ఎస్ఐ ప్రవర్తనపై రూరల్ డిఎస్పీని కలిసి ఫిర్యాదు కూడా చేశారు. సివిల్ వివాదాలకు పోలీసులు దూరంగా ఉండాలని ఎస్పీ జారీచేసిన ఆదేశాలను సైతం ధిక్కరిస్తున్నారు.

భూసమస్యలు, వివాదాలను పరిష్కరించాల్సిన రెవిన్యూ అధికారులు నిర్లక్ష్యంగా ఉండడం వల్ల గిరిజనులు నష్టపోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. కాని ఎస్ఐ తలదూర్చడంపై ఆందోళన చేయాలని నిర్ణయించారు. భూములు ఆక్రమించిన భూస్వాములపై చర్యలు తీసుకొని గిరిజనులకు భూములు స్వాధీనం చేసేందుకు అధికారులు చర్యలు తీసుకోవాల్సి ఉంది. లేకుంటే పరిస్థితులు మరింత ఉద్రిక్తతకు దారితీసే ప్రమాదం ఉంది. J

అల్లూరు రహీం

విజయవాడలో వంగవీటి రాధా, రంగా, దేవినేని గాంధీ – నెహ్రూ కుటుంబాల మధ్య రగిలిన పగా పంతాలు, హత్యా రాజకీయాలను జొప్పిస్తూ సంచలన దర్శకుడు రామ్‌గోపాల్‌వర్మ తన శిష్యుడు వివేక్ కృష్ణ చేత తీయించిన చిత్రం బెజవాడ. ఈ చిత్రానికి ముందు ఆయన బెజవాడ రౌడీలు అని పేరు పెట్టారు. ఈ పేరుపై రేగిన రగడ ఈ చిత్రం పబ్లిసిటీకి బాగా వుపయోగపడింది. అంతిమంగా విడుదలైన ఈ చిత్రంలో పస లేదు. కథకు సరైన ట్రీట్‌మెంట్, స్క్రీన్‌ప్లే చక్కగా లేకపోవడం సినిమా మొత్తం చంపుకోవడానికే పరిమితం కావడంతో జనం దీన్ని చూడలేక పోతున్నారు. జనం థియేటర్‌లోనికి పోయే ముందు ఈ చిత్రాన్ని శివతో పోల్చి చూసుకొని బయటికి వుస్సూరుమంటూ వస్తున్నారు. విజయవాడ వాసులకు ఈ చిత్రం నచ్చువచ్చునే మోగానీ రాష్ట్రమంతా నచ్చి మెచ్చేలా రూపొందించడంలో దర్శకుడు పూర్తిగా విఫలమయ్యాడు. నలుగురు సంగీత దర్శకులు, మరో నలుగురు ఫైట్ మాస్టర్లు ఈ చిత్రానికి పనిచేసినా ఒక్కపాట, ఫైట్ జనాన్ని అలరించలేదు. చిత్రీకరణలో బొటాబొటీగా చెప్పుకోవాల్సింది 'వేయ్‌రా' ఐటమ్ పాట ఒక్కటే. బెజవాడలో రౌడీయిజాన్ని చాటి చెప్పే బెజవాడ... గజగజ పాట వినసొంపుగా లేదు. దర్శకుడు వివేక్ కృష్ణనే వ్రాసిన మాటల్లో చావు ముందర నిలబడితే ఎవరైనా తలవంచాల్సిందే. రౌడీయిజానికి రాజకీయానికి పడదు. కత్తి ఎవడు పొడిచినా దిగుతుంది. ఎవరైనా ఒకరి దగ్గర అన్నం తింటే వారికి విశ్వాసంగా వుండాలి బాగున్నాయి.




వంగవీటి రాధా ఎలా వుండేవాడో ఈ తరానికి తెలియదు. కాని ఈ పాత్రను ప్రభు చాలా బాగా పోషించాడు. రంగాగా బాలీవుడ్ నటుడు అభిమన్యు సింగ్, దేవినేని గాంధీని పోలిన పాత్రలో ముకుల్‌దేవ్ జీవించాడు. విజయవాడ రాజకీయాల్లో ప్రముఖ పాత్ర పోషించిన యునైటెడ్ ఇండిపెండెంట్స్, యుఎస్‌ఓ, రాధా రంగా మిత్ర మండలి జోలికి మాత్రం దర్శకుడు వెళ్లకుండా జాగ్రత్తపడ్డాడు. పబ్లిక్‌గా సన్నివేశాల చిత్రీకరణను కష్టపడి కెమెరామెన్ భూపతి తీశాడు. దేవినేని బ్రదర్స్‌లో ఒకనిగా అక్కినేని నాగచైతన్య నటన పరవాలేదు. కాని ఈ స్థాయి పాత్ర పోషణకు ఆయన ఇంకొన్నినాళ్లు వేచి వుంటే బాగుండేది. ప్రేమిస్తే ఫేం హీరోయిన్ అమలా పాల్‌కు రౌడీయిజం నేపథ్యంతో సాగే ఈ చిత్రంలో నటించే అవకాశం కుదరలేదు.

చిత్ర కథలోనికి వెళ్తే బెజవాడను తన కనుసన్నలలో శాసించే కాళికా ప్రసాద్ (ప్రభు)కు నమ్మినబంటు విజయకృష్ణ(ముకుల్ దేవ్). తన అన్న తనకన్నా విజయకృష్ణకు ప్రాముఖ్యత ఇవ్వడం కాళికా ప్రసాద్ తమ్ముడు శంకర్(అభిమన్యుసింగ్)కు నచ్చదు. విజయకృష్ణ తమ్ముడు జయకృష్ణ (అజయ్)పెళ్లిలో కిరాయి మూకల చేత శంకర్ అన్నను హత్య చేయించి ఊరంతా విజయకృష్ణే చంపాడని ప్రచారం చేస్తాడు. కొన్నాళ్లు గడిచాక విజయకృష్ణకు స్పాట్ పెడతాడు. అన్న హత్యను కళ్లారా చూసిన శివకృష్ణ (నాగచైతన్య) రగిలిపోతాడు. తన మిత్ర బృందంతో ప్రత్యేక గ్రూపును స్థాపించుకొని ఓసారి శంకర్‌పై మెరుపు దాడి చేస్తాడు. పోలీసు కమిషనర్ ఆదివిష్ణు(ఆహుతి ప్రసాద్) కుమార్తె గీతాంజలి(అమలాపాల్) శివకృష్ణను ప్రేమిస్తుంటుంది. ఇరువర్గాల మధ్య పగ ప్రతీకారాల్లో శివకృష్ణ సోదరుడు జయకృష్ణను సైతం శంకర్ చంపేస్తాడు. దీంతో సహనం నశించిన శివకృష్ణ బెజవాడలో శంకర్‌ను వెంటాడి వేటాడి చంపడంతో సినిమా ముగుస్తుంది. ఫ్యాక్షన్ నేపథ్యంలో సాగే రక్తచరిత్ర మొదటి భాగాన్ని బాగా తీసిన రామ్‌గోపాల్ వర్మ తాను నిర్మాతగా కూడా వ్యవహరించి తనకు బాగా తెలిసిన విజయవాడ రౌడీయిజాన్ని తెర కెక్కించడంలో విఫలం కావడం సినీ అభిమానుల్లో చర్చనీయాంశంగా మారింది.

## భజ్జీ - గీతాల పెళ్లి





క్రికెట్ ఆటగాళ్లు, సినీతారల మధ్య సంబంధాలు ఈ నాటివి కావు. రవిశాస్త్రి – అమృతాసింగ్, రిచర్డ్స్– నీనాగుప్త, పటౌడీ – షర్మిలా ఠాగూర్, అజరుద్దీన్ – సంగీత బిజ్లానీ, వసీమ్ అక్రమ్ – సుస్మితా సేన్ పేర్లు ఈ కోవలోనివే. ఇందులో కొందరు వివాహం చేసుకొన్నారు. కొన్ని ప్రచారం వరకే పరిమితమయ్యాయి. అయితే స్పిన్ మాంత్రికుడు హర్భజన్ సింగ్, బాలీవుడ్ నటి గీతాబస్రాల మధ్య ప్రేమాయణం కొన్నేళ్లుగా సాగుతోంది. వచ్చే ఏడాది ప్రథమార్థంలో వీరిద్దరి నిశ్చితార్థం జరుగుతుందని తెలిసింది. ఈ వేడుక లండన్‌లో జరుగుతుందట. గీతా కుటుంబ సభ్యులు, బంధువులు ఎక్కువ మంది లండన్‌లోనే స్థిరపడ్డారు. వివాహం మాత్రం భజ్జీ స్వస్థలం పంజాబ్‌లోని జలంధర్‌లో వుంటుంది.

## ఓటమిని భరించలేను



హీరోయిన్ సమంత ప్రస్థానం దూకుడుగానే వుంది. తన కెరీర్ గూర్చి సమంత వివరిస్తూ హీరోయిన్ పాత్రకు కొన్ని పరిమితులున్నాయి. ఆ పరిధిలోనే మంచి పాత్రలు ఎంచుకొంటాను. ప్రయోగాల పేరుతోనో, అవార్డుల మీద ఆశతోనో నాకు నప్పని పాత్రలు చేయను. ప్రతి విషయాన్ని పాజిటివ్‌గా ఆలోచించడం నాకు అలవాటు. ఏమైపోతుందో? ఏమో? అని ఆలోచిస్తూ కూర్చుంటే వెనుకేవుంటాం. అలాగని తొందరపాటు నిర్ణయాలు తీసుకోకూడదు. కెరీర్‌లో చాలా కీలకమైన దశలో వున్నాను. నాలుగు విజయాలు చేతిలో వున్నంతమాత్రాన నేనేదో సాధించేసినట్లు కాదు. ఇక మీదటే జాగ్రత్తగా వుండాలి. ప్రతీ విజయం ఓ మెట్టు ఎక్కిస్తుంది. అదే ఓటమి... పదిరెట్లు దించుతుంది. అందుకే నాకు ఓటమి అంటే భయమంటుంది సమంత.

## నటనలో పసికూనను!



కమల్‌హాసన్... పాత్రకు ప్రాణంపోసే నటుడు. కాని ఆయన కుమార్తె శ్రుతిహాసన్ మాత్రం తాను తన తండ్రి తరహా నటిని కాదంటుంది. ఈ విషయమై వివరిస్తూ నటనలో మెథడ్ యాక్టింగ్, నేచురల్ యాక్టింగ్ అంటూ రకరకాల పేర్లు వినిపిస్తుంటాయి. అలాంటి నటన నాకు రాదు. దర్శక, రచయితలు సిద్ధం చేసిన పాత్రకు అనుగుణంగా మాత్రమే నటించగలను. ఆ పాత్ర స్వరూప స్వభావాలను అర్థం చేసుకొంటాను. అందుకే అవసరమైన మోతాదులోనే హావభావాల్ని పలికిస్తాను. పాత్రను జీర్ణం చేసుకొని పరకాయ ప్రవేశం చేసేంత అనుభవం నాకు లేదు. మా నాన్న లెజెండ్. నేను ఇప్పుడిప్పుడే నటనలో తొలి అడుగులు వేస్తున్న పసికూనని చెప్పుకొచ్చింది.

## ఐదేళ్లు ఢోకాలేదు!



బొద్దుగుమ్మ నమిత చేతిలో ప్రస్తుతం ఐదు చిత్రాలు ఉన్నాయి. ఫైర్ చిత్రం షూటింగ్ గ్యాప్‌లో పిచ్చాపాటీగా మాట్లాడింది. ఎన్ని సినిమాలు చేసినా, ఎంత సంపాదించినా సంతృప్తి అనేది చాలా ముఖ్యం. అది లేకపోతే ఏమీ సాధించనట్టే. నేను నటించిన ప్రతి సినిమా నాకు నచ్చే చేశా. అందుకే సాధించిన ఫలితాలతో సంతృప్తిగా వున్నా. నాకు కనీసం ఐదేళ్ల సినిమాలు వుంటాయని నమ్మకం. ఆ తర్వాతే పెళ్లి. అయినా ఏదీ మన చేతుల్లో లేదు. అన్నీ సమయానుగుణంగా జరిగిపోతున్నాయంటూ మెట్ట వేదాంతం చెప్పింది.

## నమ్మకం జాస్తి!



తనపై తనకు నమ్మకం జాస్తని నటి తాప్సి చెబుతుంది. ఈ విషయం వివరిస్తూ మనసుకి ఏది నచ్చితే అదే చేస్తా. తరువాత ఏమవుతుంది? తప్పొప్పులు ఏమిటి? ఇవేమి ఆలోచించను. ఒక విధంగా ఇదే నా బలం. మరోవిధంగా అనుకొని ఏదీ చేయను. అంతా మంచే జరుగుతుంది అనుకొంటాం. ఝుమ్మందినాదం నుంచి మొగుడు వరకు అన్ని సినిమాలు నచ్చే చేశాను. కొన్ని ఆడనంతమాత్రాన తప్పుచేశామని అనుకోవాల్సిన అవసరం లేదు. సినీపరిశ్రమలో తొందరపాటు నిర్ణయాలు కుదరదంటారు సినీయర్లు. ఈ మాటను ఆచరించే యత్నం చేస్తానంటుంది తాప్సి.

# క్షీణిస్తోన్న పారిశుద్ధ్యం

## ● పట్టించుకోని అధికార గణం

నెల్లూరు నగరంలో పారిశుద్ధ్యం పరిస్థితి నానాటికీ క్షీణిస్తోంది. పర్యవేక్షణ కరువవడంతో అస్తవ్యస్తంగా మారింది. నగరంలో ఎక్కడచూసినా, ఏ సందు గొందుల్లో పరికించినా చెత్తాచెదారాలు పేరుకుపోయి ఉంటున్నాయి. పారిశుద్ధ్యాన్ని మెరుగుపరచేందుకు కోట్ల రూపాయలు ఖర్చు చేస్తున్నా ఫలితం లేకుండా పోతోంది. అసలే అంతంతమాత్రంగా వున్న పారిశుద్ధ్యం వర్షంవస్తే మరింతగా క్షీణిస్తుండడంతో నగరవాసులు తీవ్ర అసౌకర్యానికి గురి కావాల్సి వస్తోంది. పారిశుద్ధ్యాన్ని మెరుగుపరచేందుకు నగరాన్ని 20 శానిటరీ డివిజన్లుగా విభజించారు. ఒక్కో డివిజన్‌కు ఒక్కో శానిటరీ ఇన్స్‌పెక్టర్, రెండు డివిజన్లకు కలిపి ఒక సూపర్‌వైజర్‌ను నియమించారు. వీరిని పర్యవేక్షించేందుకు నగర శానిటరీ సూపర్‌వైజర్ ఉంటాడు. మునిసిపల్ హెల్త్ ఆఫీసర్ల అందరిపై పర్యవేక్షణకు మునిసిపల్ కమిషనర్, ప్రత్యేకాధికారుల ఉన్నా పారిశుద్ధ్యం క్షీణిస్తూనే ఉంది. నగరంలో 78 సొసైటీలకు 877 మంది పారిశుద్ధ్య కార్మికులు పనిచేస్తూ ఉన్నారు. వీరిలో పర్మినెంట్ కార్మికులు 422 మంది ఉన్నారు. దాదాపు 250 మెట్రిక్ టన్నుల చెత్త ఉత్పత్తి అవుతుండగా ఈ చెత్తను తరలించేందుకు 55 ఆటోలు, 276 డంపర్ బిన్స్, 20 హైడ్రాలిక్ లారీలు, ఐదు డంపర్ లారీలు, 12 ట్రాక్టర్లు ఉన్నాయి. వీటి నిర్వహణ కోసం ప్రతినిత్యం లక్షల రూపాయలు ఖర్చు చేస్తున్నారు. అయినా పారిశుద్ధ్యం మెరుగుపడిన దాఖలాలు లేవు. దీంతో నెల్లూరు చెత్త నగరంలా దర్శనమిస్తుంది.



నగరంలో ఎక్కడచూసినా చెత్త గుట్టలే.

# పైసలిస్తే అంతా ఓకే!

## ● స్కూళ్లకు ఎన్‌ఓసిలు ఇవ్వడంలో అగ్నిమాపక శాఖ చేతివాటం




అవినీతి బాటన అగ్నిమాపక శాఖ.

జిల్లా అగ్నిమాపక శాఖలో అవినీతి హెచ్చుమీరింది. పెద్ద పెద్ద భవంతులకు, పాఠశాలలకు, హాస్పిటళ్లకు, సినిమా హాళ్లకు ఇచ్చే నో అబ్జెక్షన్ సర్టిఫికేట్లు ఆ శాఖ సిబ్బందికి కాసులు కురిపిస్తున్నాయి. చేయి తడిపితే అంతా ఓకే అన్న తరహాలో ఎలాంటి పరిశీలన, తనిఖీ చేయకుండానే ఎన్‌ఓసి ఇచ్చేస్తుండడంతో ఈ వ్యవహారం గబ్బుపట్టిపోయింది. ముఖ్యంగా పాఠశాలలకు ఇచ్చే సర్టిఫికేట్ల కోసం ఆయా యాజమాన్యాల వద్ద నుంచి 40వేల రూపాయల నుంచి లక్ష రూపాయలదాకా స్థాయినిబట్టి వసూలు చేస్తున్నారనే ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. నిబంధనల ప్రకారం పాఠశాలలు, హాస్పిటళ్లు, భవంతులు నిర్మించే సమయంలో భవిష్యత్తులో ఏదైనా అగ్ని ప్రమాదం సంభవించినట్లైతే దానిని నివారించేందుకు భవనం చుట్టూ అగ్నిమాపక వాహనం తిరిగేందుకు, మంటలను ఆర్పివేసేందుకు తగిన ఏర్పాట్లు ఉండాలి. పాఠశాలకైతే రెండు వైపులా మెట్లు ఉండడంతోపాటు మిగతా నిబంధనలన్నీ వర్తిస్తాయి. గతంలో తమిళనాడు రాష్ట్రం కుంభకోణంలో ఘోర అగ్నిప్రమాదం జరిగి పలువురు పాఠశాల విద్యార్థులు మృతి చెందిన తర్వాత ఈ నిబంధనలను మరింత కఠినతరం చేశాయి ప్రభుత్వాలు. అయితే చాలా పాఠశాలలు, అపార్టుమెంట్లు, ఇతర నిర్మాణాలకు నిబంధనలు పాటించరు. అలాంటి వాటికి నో అబ్జెక్షన్ సర్టిఫికేట్లు ఇవ్వకూడదు. కానీ అగ్నిమాపక శాఖ స్టేషన్ అధికారులు కొందరు భారీ స్థాయిలో ముడుపులు అందుకొంటూ ఎడాపెడా ఎన్‌ఓసిలు ఇచ్చి వేస్తుండడం విమర్శల పాలవుతుంది. మొన్నటి వరకు పనీపాట లేకుండా ఖాళీగా ఉన్న సిబ్బందికి ఎన్‌ఓసిల పుణ్యమా అని రెండు చేతులా ఆర్జన అయ్యిందనే వ్యాఖ్యలు వినవస్తున్నాయి.

# దేహదానం చేసిన దమయంతమ్మ!



దేహదానంతో అజరామర కీర్తి.

రక్తదానం, నేత్రదానంతోపాటు అవయవాల దానం చేయడం ఎంతో గొప్ప విషయం. తనువు చాలించిన తర్వాత తమ దేహాన్ని పలువురికి జీవితాన్ని అందించేందుకు దాతలు ముందుకు రావడం అభినందించతగినది, మార్గదర్శకమైనది. దీనిపై ప్రజలను చైతన్య పరచేందుకు దేహదానం ప్రాశస్త్యాన్ని తెలియజెప్పేందుకు 2000 సంవత్సరంలో స్థాపించబడినది పినాకినీ దేహ సమర్పకుల సంస్థ. ఇది దక్షిణ భారతంలోనే తొలి దేహదాన సంస్థ. ఇది ఏర్పడిన నాటి నుంచి ఇప్పటివరకు ముగ్గురు దేహదానం చేశారు. మూడో దేహదానం చేసింది చేవూరు దమయంతమ్మ గారు. 96 ఏళ్ల వయస్సుగల ఈ వృద్ధురాలు మరణానంతరం తన దేహాన్ని పినాకిని దేహ సమర్పకుల సంస్థకు దానం చేసింది. నవంబర్ 29న ఆమె మరణించిన తర్వాత ఆమె నేత్రాలను నెల్లూరు నేత్రదాతల సంస్థ సేకరించగా, దేహాన్ని నారాయణ వైద్యకళాశాల శరీర నిర్మాణ శాస్త్ర విభాగానికి తరలించారు. రాష్ట్రంలోనే దేహదానం చేసిన తొలి మహిళ దమయంతమ్మ కావడం విశేషం. దేహదానం చేసిన వారందరికీ వారి కుటుంబ సభ్యులకు సంస్థ నిర్వాహకుడు తిక్కవరపు సుకుమార్‌రెడ్డి కృతజ్ఞతలు చెప్పున్నారు.

# క్రీస్తు విగ్రహ ఏర్పాటుపై రగడ!

## ● వ్యతిరేకిస్తున్న బిజెపి



ఆనం వెంకటరెడ్డి విగ్రహం కళ్లకు గంతలు కడుతున్న ఎబివిపి విద్యార్థి సంఘం కార్యకర్తలు.

విఆర్ కళాశాలకు అనుబంధంగా వైఎంసిఏ గ్రౌండ్స్‌లో నిర్మిస్తున్న భవనం ఆవరణలో ఏసుక్రీస్తు విగ్రహం ఏర్పాటు చేయడంపై సర్వత్రా నిరసన వ్యక్తమౌతోంది. విద్యాలయంలో మతాన్ని చొప్పించేలా మత బోధకుల విగ్రహాలను ఏర్పాటు చేయడం నిబంధనలకు విరుద్ధమంటూ బిజెపితోపాటు అనుబంధ సంస్థలైన విశ్వ హిందూ పరిషత్, ఆర్‌ఎస్‌ఎస్, విద్యార్థి విభాగాలైన ఎబివిపి తదితర సంస్థలు నిరసన వ్యక్తం చేశాయి. జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డితోపాటు డిఆర్‌ఓ రామిరెడ్డిని కలసిన బిజెపి జిల్లా అధ్యక్షుడు కర్నాటి ఆంజనేయరెడ్డి, రమేష్, విహెచ్‌పి నేతలు రామ్మోహన్ తదితరులు దీనిపై తీవ్ర అభ్యంతరం వ్యక్తం చేశారు. నిబంధనలకు విరుద్ధంగా క్రీస్తు విగ్రహం ఏర్పాటు చేయడం ప్రజలను తప్పుదోవ పట్టించడమేనని, విద్యార్థుల మనస్సుల్లో మతబీజాలు నాటడమేనంటూ విమర్శించారు. దీనిపై చర్యలు చేపట్టాలని కోరారు. మరోవైపు ఎబివిపి విద్యార్థులు రామలింగాపురం సెంటర్ వద్ద గల ఆనం వెంకటరెడ్డి విగ్రహానికి నల్లగుడ్డలు కట్టి నిరసన తెలిపారు. బిజెపి, అనుబంధ సంఘాలు ఒకవైపు ఆనం వివేకానందరెడ్డి చర్యలపై అభ్యంతరం వ్యక్తం చేస్తుంటే మరోవైపు ఆయన బిషప్ చేత విగ్రహాన్ని ప్రారంభింపచేయడం పట్ల నగరంలో తీవ్రమైన చర్చ జరుగుతోంది. క్రిస్టియన్ విద్యాసంస్థలకు వ్యతిరేకంగా ఏర్పాటైన విఆర్ కళాశాలలో ఇలాంటివి చోటుచేసుకోవడంపై పలువురు తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు.

## ● పరిశ్రమ లేకుంటే

# భూములు వెనక్కు!

ప్రత్యేక ఆర్థిక మండళ్లు, వివిధ పరిశ్రమలకు ప్రభుత్వం కేటాయించిన భూముల్లో పరిశ్రమలు ఏర్పాటు చేయకపోతే వాటిని వెనక్కు తీసుకోవాలని ప్రభుత్వం నిర్ణయించింది. జిల్లాలో పరిశ్రమల స్థాపన, భూముల కేటాయింపుపై అధికారులు పరిశీలన చేయనున్నారు. పరిశ్రమల ఏర్పాటుకోసం రైతుల నుంచి భూములు సేకరించి వివిధ సంస్థలకు అప్పగించి సంవత్సరాలు గడుస్తున్నా కొన్ని పరిశ్రమలు నిర్మాణాలు చేపట్టడం లేదు. రైతుల నుంచి భూముల్ని సేకరించే సమయంలో పరిహారమందించడంతోపాటు స్థానికులకు ఉపాధి అవకాశాలు కల్పిస్తామని అప్పట్లో అధికారులు, సంస్థ ప్రతినిధులు హామీ ఇచ్చారు. జిల్లాలో ఒక్క అపాచీ బూట్ల తయారీ కంపెనీ మాత్రం ఏర్పాటు జరిగింది. ఇఫ్కో సెజ్‌కు దాదాపు 2400 ఎకరాలు కేటాయించినప్పటికీ ప్రహరీ గోడల నిర్మాణాలు మాత్రమే జరిగాయి. చింతవరంలో మాస్‌హోల్డింగ్స్ ఆధ్వర్యంలో నిర్మించాల్సిన టెక్స్‌టైల్ పార్కు నేటికీ పునాదులకే పరిమితమై ఉంది. పరిశ్రమల నిర్వాహకులకు నిర్ణీత గడువు విధించి నిర్మాణాలు పూర్తిచేయకుంటే భూముల్ని తిరిగి స్వాధీనం చేసుకునే అవకాశం ఉంది.

## అవిశ్వాస చదరంగం

మొదటి పేజీ కొరవ

కోవడానికి సిద్ధ పడడం అన్నది ఆషామాషీ వ్యవహారం కాదు. ప్రభుత్వం వైపు నుంచి ప్రలోభాలు, బెదరింపులు, బుజ్జగింపులను తట్టుకొని నిలబడడం చిన్న విషయం కాదు. అందులోనూ జగన్ వున్న పరిస్థితి ఏమిటో అందరికీ తెలుసు. ఏరోజు సిబిఐ అధికారులు ఆయన్ను అరెస్టు చేసి, జైలుకు పంపుతారో ఎవరికీ తెలియదు. ఒకసారి లోపలకు వెళ్తే, తిరిగి ఎప్పుడు బయటకు వస్తాడో తెలియదు. కనీసం 2014 ఎన్నికల నాటికైనా విడుదల చేస్తారో లేదో తెలియదు. అంత అనిశ్చిత స్థితిలో కూడా జగన్ నాయకత్వం మీద అంత మంది ఎమ్మెల్యేలు విశ్వాసం ప్రదర్శించడం నిజంగా ఆశ్చర్య పడవలసిన విషయం. ఆ రకంగా చూస్తే, ఈ అవిశ్వాస చదరంగంలో జగన్‌కు ఎదురైంది గెలుపే తప్ప ఓటమి కాదని అర్థమౌతుంది.

మరొకప్రక్క జగన్ పక్షం చేరిన ఎమ్మెల్యేల మీద విప్ ధిక్కార వేటు వేయడంలో కిరణ్ బృందం అనుసరిస్తున్న వూగిసలాట వైఖరి సైతం జగన్ ప్రతిష్టను పెంచుతుంది. శాసనసభలో ఓటింగ్ జరిగేటప్పుడు జగన్ పక్క నిలబడిన ఎమ్మెల్యేలను కాంగ్రెస్ మంత్రులు వుక్కిరి బిక్కిరి చేశారు. లోపలకు వెళ్లి ఓటు వేస్తే, బయటకు వచ్చేటప్పటికి మీరు ఎమ్మెల్యేలుగా మిగలరని భయపెట్టారు. కనీసం ఆరేళ్లపాటు మీరు మళ్లీ ఎన్నికలలో పోటీ చేయకుండా నిషేధం విధింప చేస్తామని హడలెత్తించారు. కానీ ఓటింగ్ తర్వాత ప్రభుత్వం మొత్తం తోక ముడిచింది. జగన్ ఎమ్మెల్యేల మీద పార్టీ ఫిరాయింపు చట్టం ప్రయోగానికి వెనుకా ముందు అవస్థ పడుతున్నది. వీరిని ఎమ్మెల్యేలుగా అనర్హులుగా చేస్తే ఉప ఎన్నికలు వస్తాయి. వాటిలో జగన్ గెలుపును నిరోధించగలమన్న నమ్మకం ఒక్క మంత్రికి కూడా లేదు. అన్ని ఉపఎన్నికలలో జగన్ గెలిచి కూర్చుంటే రెండేళ్ల తర్వాత జరగనున్న సాధారణ ఎన్నికలకు ఆయనకు ప్రాణ వాయువు అందించినట్లు అవుతుంది. అన్ని ఉప ఎన్నికలలో ఓడితే ప్రభుత్వాన్ని నడపడం చాలా కష్టం. నైతికంగా బలహీనపడి పోతారు. ఆ భయంతోనే జగన్ ఎమ్మెల్యేల మీద వేటు వేయడానికి వెనుకాడుతున్నాడు ముఖ్యమంత్రి. ఆయన్ను అంతగా ఇరకాటంలోకి నెట్టడం కూడా జగన్ గెలుపు క్రిందే లెక్క.

ఈ మొత్తం వ్యవహారంలో అర్థమయ్యేది ఒక్కటే. రాష్ట్ర రాజకీయాలలో కాంగ్రెస్, తెలుగుదేశం వంటి ప్రధాన పార్టీలన్నీ ఒక ఎత్తు, బొడ్డూడని పసికందు వంటి జగన్ ఒక్కడూ ఒక ఎత్తు. ఎన్నియో యుద్ధముల ఆరితేరిన యోధాను యోధులను, ఏ అనుభవం లేని జగన్ తత్తర పెడుతున్నాడు. భయపెడుతున్నాడు. బాధ పెడుతున్నాడు. నిస్సహాయతలోకి నెట్టి పారేస్తున్నాడు. దాన్ని జగన్ రాజకీయ చాతుర్యం అనుకోవచ్చు. లేదంటే వైఎస్. రాజశేఖర్‌రెడ్డి ఇచ్చిపోయిన వరం అనుకోవచ్చు.

## కెవిపి మొగ్గెటో

మొదటి పేజీ కొరవ

ఒప్పేది కాదు. కానీ అవిశ్వాస తీర్మానంతో ఆ అనుమానాలన్నీ పటాపంచలైపోయాయి. జగన్ వర్గం ఎమ్మెల్యేలను ప్రలోభపెట్టి, వెనక్కు రప్పించే బృహత్కార్యం కెవిపి రామచంద్రరావు భుజాల మీద పెట్టింది అధిష్టానం. దాన్ని బహు చక్కగా నిర్వహించాడు కెవిపి. నేరుగా శాసనసభకే వచ్చి, జగన్ వర్గ ఎమ్మెల్యేలను కలిసి, వారు కోరిన కోరికలన్నీ తీర్చడానికి సిద్ధపడ్డాడు. పాత మొగమాటాలను బయటకు తెచ్చాడు. కనీసం పది మంది జగన్ ఎమ్మెల్యేల మీద కెవిపి ప్రభావం పని చేసిందని అంచనా.

తన ప్రాణస్నేహితుడి కుమారుడిని రాజకీయంగా దెబ్బ తీయడానికి కెవిపి నేరుగా ఎందుకు రంగంలోకి దిగాడన్నది ప్రశ్న. అందుకు ఒకటే కారణం కన్పిస్తున్నది. సిబిఐ కేసుల బెడద నుంచి తనను తాను రక్షించుకోవాలంటే జగన్‌ను బలి పెట్టక తప్పదన్న అభిప్రాయమే అది. వైఎస్ హయాంలో జరిగిన ప్రతి అవినీతి కార్యంలో కెవిపి ప్రమేయం వుంది. ఆయన చేతుల మీదుగా కనీసం ఒక లక్ష కోట్ల రూపాయల ప్రజాధనం దోపిడీ జరిగి వుంటుంది. ప్రతి ఫైల్ వెనుకా ఆయన ప్రోద్బలం వుంది. సిబిఐ కేసుల్లో చిక్కుకొన్న ఐఎఎస్ అధికారులు ఏ ఒక్కరు ఆయన పేరు బయట పెట్టినా, జగన్‌తో పాటుగా ఆయనా జైలుకు వెళ్లడం ఖాయం. ఆ ప్రమాదం తప్పించుకోవడానికే కెవిపి ఇంత బహిరంగంగా బయటపడ్డాడని చెప్తున్నారు. తన మొగ్గు ఎటో అధిష్టానానికి తెల్పి చెప్పడానికి దీన్నొక అవకాశంగా వాడుకొన్నాడు. ప్రాణ విత్త మాన భంగమందు బొంక వచ్చని సత్యసంధు డైన ధర్మరాజే చెప్పాడు. జైలు వూచల చెర తప్పించుకొని ప్రాణ స్నేహితుడికి ద్రోహం చేయడంలో తప్పులేదని సిద్ధాంతీకరించుకొన్నాడన్న మాట.

## సిబిఐ పరువుపోయింది

మొదటి పేజీ కొరవ

తెమ్మ కోరికలు తీర్చగలదనే నమ్మకం కల్గించడం కోసం, తాను చక్కెర శాఖ కమిషనర్‌గా వున్నప్పుడు ఒక చక్కెర ఫ్యాక్టరీని ప్రైవేటు పరం చేయడంలో అడ్డదిడ్డంగా ఫైళ్లు తయారుచేసి చూపించి మరీ, గనుల శాఖకు పోస్టింగ్ ఇప్పించుకొందని అందరికీ తెలుసు. ఆ చక్కెర ఫ్యాక్టరీ వ్యవహారంతోనే ఆమె కెవిపి రామచంద్రరావు విశ్వాసం చూరగొన్నారామె.

గాలి గనుల కేసులో ఆమె చేసిన అక్రమాలు అన్నీ ఇన్నీ కావన్న నిర్ధారణ తర్వాతనే ఎఫ్ఐఆర్‌లో నిందితురాలిగా చేర్చారు. ఒకటికి పదిసార్లు పిలిపించి, విచారణ జరిపారు. అరెస్ట్ కూడా చేశారు. కానీ ఆ దశలో శ్రీలక్ష్మి తన విశ్వరూపం ప్రదర్శించారు. ఢిల్లీలో, హైదరాబాద్‌లోని ఐఎఎస్ వున్నతాధికారులను రంగంలోకి దింపారు. ఐఎఎస్, ఐపిఎస్ సంఘాలను కదిలించారు. విపరీతమైన ఒత్తిడి తెచ్చారు. పలు దొంగ నాటకాలాడారు. గుండె నొప్పి వున్నట్లు, నడవడానికి కూడా ఓపికలేనట్లు అవస్థ పడుతున్నట్లు నటించారు. కడవల కొద్దీ కన్నీళ్లు కార్చి, సిబిఐ అధికారుల మనసు కరిగింప చేశారు. ఒకే ఒక్కరోజు జైలు జీవితంతో బయటపడిపోయారు.

సిబిఐ ప్రత్యేక కోర్టు ఆమెను రిమాండ్‌కు పంపింది. సిబిఐ కేసులలో రిమాండ్ మీద జైలుకు వెళ్లిన వారెవరికీ అంత సులభంగా బెయిల్ దొరకదన్నది నిజం. సత్యం రామలింగరాజు నుంచి కనిమొళి వరకు అందరి అనుభవం అదే. కానీ జైలుకు వెళ్లే సమయంలో ఒక్క జత బట్టలు కూడా వెంట తీసుక వెళ్లలేదు శ్రీలక్ష్మి. దాని అర్థం – తనకు పక్క రోజే బెయిల్ ఖాయంగా వస్తుందన్న నిజం ఆమెకు ముందుగానే తెలుసన్నమాట. ఈ ఒక్క సంఘటనతో ఇంతకాలం సిబిఐ పెంచుకొంటూ వచ్చిన ప్రతిష్ఠ కాస్తా మంటకలిసిపోయింది.

శ్రీలక్ష్మి నిజంగా నేరస్థురాలా కాదా అన్నది ఇప్పుడే చెప్పలేము. తన నిజాయితీని కోర్టులో నిరూపించుకొనే అవకాశం ఆమెకు వుంది. అది ఆమె హక్కు. అయితే గాలి జనార్ధనరెడ్డి, కోనేరు ప్రసాద్ వంటి వారికి కూడా ఆ హక్కు వుంది. వారు ఇప్పటి వరకు నిందితులే తప్ప నేరస్తులు కారు. కానీ వారికి ఒక న్యాయం పాటించిన సిబిఐ, ఐఎఎస్ అధికారిణి అనే సానుకూలతతో శ్రీలక్ష్మి పట్ల వేరొక న్యాయం పాటించింది. ఐఎఎస్ అధికారులను చార్జిషీట్‌లో చేర్చాలంటే, ప్రభుత్వ అనుమతి కావాలని, అది ఇంకా రాలేదు కాబట్టి, ఆమెకు సులభంగా బెయిల్ దొరికిందని చెప్తున్నారు. ప్రభుత్వ అనుమతి లేదని తెలిసినప్పుడు ఆమెను అరెస్టు చేయడం ఎందుకు? అనుమతి వచ్చిన తర్వాతే నిర్ణయం తీసుకోవచ్చు కదా? మరొక ఐఎఎస్ అధికారి బిపి ఆచార్య విషయంలో, ఆనాటి గనుల మంత్రి సబితా ఇంద్రారెడ్డి విషయంలో కూడా సిబిఐ ఇటువంటి కప్పదాటు వైఖరే అవలంబిస్తున్నది. ఎంత మాత్రం సమర్థనీయం కాని పోకడ అది. తప్పు చేసిన వాడు, ఎవడైనా ఒకటే వైఖరితో కేసులు నడిపితేనే సిబిఐ ప్రతిష్ఠ. అది జరగనప్పుడు వారు చేసే మంచి పనులు కూడా అనుమానాలకు తావిస్తాయి.

## విఆర్ కాలేజి

16వ పేజీ కొరవ

గ్రౌండ్‌ను ప్రైవేట్ పరం చేయజూడడం. చర్చెస్ ఆఫ్ సౌత్ ఇండియా సంస్థ వద్ద నాలుగు ఎకరాల డెబ్బై సెంట్ల వైఎంసిఏ భూమిని కొనుగోలు చేశారు పాతదినాలలో. ఆ సంస్థ ప్రతినిధులు కూడా తమ భూమి విద్యా సంస్థకు ఉపయోగ పడడం సంతోషమని భావించి, చాలా చవక ధరకు, అదికూడా పది పన్నెండు సార్లుగా రిజిష్టర్ చేశారు. కాలేజి విస్తరణకు దాన్ని వాడుకోవాలన్నది ఆలోచన. కానీ వివేకానందరెడ్డి అక్కడొక భారీ భవనం కట్టాడు. అది ఎందుకో ఎవరికీ తెలియదు. బియిడి కాలేజ్ స్థాపనకని అబద్ధం చెప్పారు. బియిడికైతే అంత భవనం అవసరం లేదు. దాని కోసం విఆర్ కాలేజిలో మేనకూరు ఆదిశేషారెడ్డి, రామసుబ్రహ్మణ్యం, భక్తవత్సల రెడ్డి తదితరులు ఎన్నో ఏళ్లుగా రూపాయి రూపాయి కూడబెట్టి, బ్యాంకులలో వేసి ఉంచిన కోట్ల రూపాయల ఫిక్స్‌డ్ డిపాజిట్లను కరిగించి వేశాడు. భవనానికి పెట్టింది గోరంత అయితే దాని పేరుతో తిన్నది కొండంత. దాదాపు తొమ్మిది కోట్ల రూపాయలను ఈ భవనం లెక్కలో వ్రాశాడంట వివేకానందరెడ్డి.

ఏదో కుట్రబుద్ధి మనసులో పెట్టుకొనే ఈ దుబారా చేశాడన్నది నిజం. కాలేజి ప్రధాన ద్వారం ముందు బోర్డ్ తుప్పుపట్టిపోయి చాలా కాలమైంది. దానికి పెయింటింగ్ వేయించడానికి డబ్బు లేదని అట్లానే వదలి పెట్టారు. కానీ వైఎంసిఏ ప్రాంగణానికి పాతిక లక్షలు ఖర్చు పెట్టి స్వాగత ద్వారం నిర్మించి అందులో ఏసు ప్రభువు బొమ్మ ప్రతిష్టించాడు. దాన్నొక చర్చ్‌గా మార్చు చేశాడు.

విశ్వసనీయంగా తెలుస్తున్న సమాచారాన్ని బట్టి, ఈ వైఎంసిఏ ప్రాంగణంలో నిర్మించిన భవనాన్ని తన ఇష్టసఖి భానుశ్రీకి లీజ్ ప్రాతిపదికన ఇవ్వడానికి సన్నాహాలు చేస్తున్నారట. ఆమె అక్కడొక మహిళా ఇంజనీరింగ్ కాలేజి నెలకొల్పే ప్రయత్నాలలో ఉందని వినికిడి. అందుకోసమే ఆ భవనాన్ని ఇంజనీరింగ్ కాలేజి అవసరాలకు తగినట్లు రూపకల్పన చేశారని చెప్తున్నారు. ఇది ఆధారం లేకుండా చెప్తున్న మాట కాదు. ఈ కుతంత్రం నెరవేర్చుకోవడం కోసం వైఎంసిఏ నుంచి విఆర్ కాలేజి కొనుగోలు చేసిన భూమి పత్రాలను మార్చడానికి విశ్వ ప్రయత్నం చేస్తున్నాడు. హైదరాబాద్‌లోని ఎస్ఆర్ నగర్ నివాసిని అయిన కమలకుమారి అనే క్రైస్తవ మహిళ ఇందుకోసం మద్రాస్‌లోని సౌత్ ఇండియా చర్చెస్ సంస్థలో తిష్టవేసి ఉందిప్పుడు. మేరీ సుందరి అనే మరొక మహిళ కూడా ఇదే పనిలో నిమగ్నమైనట్లు తెలుస్తున్నది.

మరొక ప్రక్క విఆర్ కాలేజిని భవిష్యత్తులో వివేకానందరెడ్డి వంటి ఆషాఢభూతులు దిగమింగకుండా చూడడానికి, హిందూ ఎండోమెంట్ సంస్థగా నమోదుచేయించి పెట్టాడు మేనకూరు ఆదిశేషారెడ్డి. 1986లో ఈ చట్టం క్రింద నమోదు చేసి, ధర్మ సంస్థల నియమం ప్రకారం ఏటా 613 రూపాయల ఎండోమెంట్ ఫీజు కూడా చెల్లించాడు. ఆ చట్టం ప్రకారం వైఎంసిఏ గ్రౌండ్‌లో చర్చ్ కట్టడం నేరం. దాన్ని ప్రైవేట్ వ్యక్తులకు అన్యాక్రాంతం చేయడం చట్ట విరుద్ధం. అందువల్ల విఆర్ కాలేజిని ఎండోమెంట్ చట్టాల నుంచి మినహాయించమని ప్రిన్సిపల్ సెక్రటరీ రమణాచారి మీద తీవ్రమైన వత్తిడి తెస్తున్నాడు. నెల్లూరు ఎండోమెంట్స్ అసిస్టెంట్ కమిషనర్ యానాదిశెట్టి తాట తీస్తున్నాడు. ఏదో ఒక రకంగా రేపటి విద్యా సంవత్సరంలోనే ఈ భారీ భవనాన్ని భానుశ్రీకి కానుకగా ఇవ్వాలన్నది ఆయన తాపత్రయమని తెలుస్తున్నది.ఎంత ఘోరం? ఎంత దురన్యాయం? నూట ముప్పై యేళ్ల చరిత్ర కల్గిన విస్తృత సంస్థకు ఈ దుర్గతి పట్టడం నిజంగా విచారం కల్గించే విషయం. నెల్లూరు టౌన్ గొడ్డు పోయిందని, నెల్లూరు పౌరులు చేవ చచ్చిన వారని తానే ఆట ఆడినా ఏ తప్పుడు పని చేసినా అడిగేవాడు లేడనే ధీమాతో పిచ్చి పట్టిన వాడివలె ప్రవర్తిస్తున్నాడు వివేకానందరెడ్డి. అన్నగారి అక్రమాలకు వంత పాడుతున్నాడు కాలేజి అధ్యక్ష స్థానంలో ఉన్న రామనారాయణరెడ్డి. ఈ తోడు దొంగల బారి నుంచి విఆర్‌కాలేజిని రక్షించుకోవడం ప్రతి పాత విద్యార్థి కర్తవ్యం. అందుకోసం ఒక విస్తృత స్థాయి ఉద్యమం మొదలు పెట్టవలసిన అవసరం ఉంది. అది ఎంత త్వరగా జరిగితే అంతే మేలు.

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

వచ్చునన్నారు. సంస్థ ఛైర్మన్ డాక్టర్ ఎన్.సత్యనారాయణ మాట్లాడుతూ ప్రస్తుతం నెల్లూరు హరనాథపురంలో ఉన్న తమ కళాశాల వచ్చే యేడాది మాగుంట లేఅవుట్‌లో నూతనంగా నిర్మించిన భవనంలోనికి మార్చుతున్నట్లు చెప్పారు. విద్యా సంస్థల మరో ఛైర్మన్ జి.కృష్ణమోహన్‌రావు, సీనియర్ ఫిజిక్స్ అధ్యాపకులు శేషగిరాజు, రంగనాథ్, వెంకటేశ్వర్లు ఫిజిక్స్‌లోని కిటుకులు చెప్పారు.

## అంబేద్కర్‌కు నివాళి

భారత రాజ్యాంగ నిర్మాత బి.ఆర్. అంబేద్కర్ 55వ వర్ధంతిని పురస్కరించు కొని నెల్లూరు విఆర్‌సి సెంటర్‌లోని ఆయన విగ్రహానికి మాలమహానాడు నేతృత్వంలో పూలమాలలు వేసి నివాళలర్పించారు. ఈ కార్యక్రమంలో స్వర్ణా వెంకయ్య, గంగపట్నం మోహన్, తలమంచి సురేంద్రబాబు, నన్నం రాజేంద్రబాబు, స్వర్ణా జీవన్ ప్రసాద్, ప్రొఫెసర్ అబ్రహం, ఎం.శ్రీనివాసులు, కె.సాల్మన్ రాజు తదితరులు పాల్గొన్నారు.

# పడకేసిన పారిశుద్ధ్యం!

నెల్లూరు నగరం, వెంకటగిరి, కావలి, గూడూరు మున్సిపాలిటీలతోపాటు మేజర్ పంచాయితీల్లో పారిశుద్ధ్యం అధ్వాన్నంగా మారి ఉంది. పాలకులు లేకపోవడంతో అధికారవర్గం పారిశుద్ధ్య విషయమై పెద్దగా పట్టించుకోకపోవడంతో సీజనల్ వ్యాధులు విజృంభిస్తున్నాయి.



బుచ్చిరెడ్డిపాళెం జమీలమహల్ ప్రక్క సందులో బాగా దెబ్బతిన్న డ్రైనేజి.

జిల్లాలో పారిశుధ్యం పడకేసింది. పల్లెలు, పట్టణాలు అన్న తేడాలేకుండా ఎక్కడ చూసినా అస్తవ్యస్త పరిస్థితులు నెలకొని వున్నాయి. మురుగు కాలువలు పొంగి పొర్లుతుండడం, చెత్తకుప్పలు, పందులు సంచారం, ఇళ్ల చుట్టూ నీరు నిలచి వున్న దృశ్యాలు ఎక్కడ చూసినా సర్వసాధారణం. నగరం, పట్టణాలు, గ్రామాలు ఒకటేమిటి అన్నింటా ఇదే పరిస్థితి. పాలకులు, అధికారులకు పారిశుధ్యం పట్టకపోవడం, కేవలం ప్రసంగాలకు, హామీలకు పరిమితం అవుతుండడంతో జిల్లావాసులకు ఇక్కట్లు తప్పడం లేదు. ఈ కారణంగా అనారోగ్యం పాలయ్యే వారి సంఖ్య రోజురోజుకు అధికమవుతోంది.

నెల్లూరు నగరంతోపాటు, వెంకటగిరి, కావలి, గూడూరు మునిసిపాలిటీలతోపాటు మేజర్ పంచాయితీల్లో పారిశుధ్యం అధ్వాన్నంగా మారి వుంది. అధికార యంత్రాంగం నిద్రావస్థలో వుండడం, పాలకులు కాంట్రాక్టులు, ఇతరత్రా వ్యాపకాలతో జేబులు నింపుకొనే పనిలో క్షణం తీరిక లేకుండా నిమగ్నమై వుండడంతో ఎక్కడా మెరుగైన పారిశుధ్య జాడ కాగడాపెట్టి వెతికినా కన్పించడం లేదు. జిల్లా అభివృద్ధికి భారీగా నిధులు మంజూరు అవుతున్నాయని అమాత్యులు, ప్రజాప్రతినిధులు ప్రకటిస్తున్నా, నిధులు విడుదల జరుగుతున్నా ప్రణాళికాబద్ధంగా ఖర్చుపెట్టకపోవడం, పారిశుధ్య కార్యక్రమాల పేరుతో అందినంత ఎవరికి వారు దోచుకతింటుండడంతో నానాటికి క్షీణించిపోతుంది తప్ప మెరుగుపడడం లేదు.

నాగరికతకు చిహ్నంగా, అభివృద్ధికి సూచికలుగా పారిశుధ్య పరిస్థితులు, రహదారులను చెప్తారు. అలాంటి వాటి పట్ల పాలకులకు శ్రద్ధలేకపోవడం; వారి చూపల్లా ఐల్యాండ్‌లు కట్టించడం, విగ్రహాలు పెట్టించడం, రోడ్లు నిర్మించడం, వాటి పేరుతో దోచుకతినడంపై మాత్రమే వుండడంతో ఎక్కడికక్కడ అస్తవ్యస్త పరిస్థితులు నెలకొంటున్నాయి. డ్రైనేజి కాలువలను ఆక్రమించి నిర్మాణాలు చేపట్టడంతో అవి కనుమరుగైపోతున్నాయి. వున్న కాల్వలు పూడికకు నోచుకోక చెత్తచెదారాలతో నిండి వుంటుండడంతో మురుగునీరు పోయే మార్గం లేక రోడ్లపైకి ప్రవహిస్తుండడంతో అక్కడ వున్న చెత్తతో కలసి మరింతగా దిగజారిపోతున్నాయి. మరోవైపు 12, 13 ఆర్థిక సంవత్సర నిధులు పెద్దఎత్తున దుర్వినియోగం అయ్యాయి. వీటి గురించి ఎవరికీ పట్టకపోవడం జిల్లా ప్రజలకు శాపంగా పరిణమించింది. దీంతో దోమలు విజృంభించి రోగాలపాలై ఆస్పత్రుల్లో చికిత్స పొందాల్సిన పరిస్థితులు నెలకొంటున్నాయి.

డెంగ్యు, మలేరియా, చికున్ గున్యాలాంటి వ్యాధుల బారినపడే వారి సంఖ్య రోజురోజుకు అధికమవుతోంది. ముఖ్యంగా అడపాదడపా వర్షాలుపడే సీజన్‌లో ఇవి మరింతగా వృద్ధి అవుతుండడంతో ప్రజలకు కంటిమీద కునుకు లేకుండా పోతోంది. ఎప్పటికి తమ వెతలు తీరుతాయో పరిశుభ్ర వాతావరణం ఏర్పడుతుందో నన్న నమ్మకం బేతాళ ప్రశ్నగా మిగులుతోంది.





నెల్లూరు రామ్‌నగర్ సెంటర్ నుంచి క్యారియర్‌తో సహా పనికి బయలుదేరిన శ్రీకాకుళం కూలీలు.

# నెల్లూరులో శ్రీకాకుళం

పొట్టకూటి కోసం రాష్ట్ర సరిహద్దుల నుంచి నగరానికి జీవనోపాధి కోసం వచ్చిన శ్రీకాకుళం వాసుల పరిస్థితి దయనీయంగా ఉంది. ఈ ప్రాంతానికి వలస వచ్చి ఏళ్లపూళ్లు గడుస్తున్నా రేషన్ కార్డులకు నోచుకోక, ఇందిరమ్మ గృహాలు లభించక పూరిగుడిసెల్లోనే బ్రతుకు వెళ్లదీయాల్సి వస్తోందని సిక్కోలు వాసులు వాపోతున్నారు. కూలి పనుల కోసం ఊరు కాని ఊరు వచ్చి అయిన వారికి దూరంగా బ్రతుకుతున్నా కనీస సౌకర్యాలకు నోచుకోక ఆ కుటుంబాలు పడుతున్న అవస్థలు అన్నీ ఇన్నీ కావు. శ్రీకాకుళం వాసులు నగరంలోని కొండాయపాళెం గేటు, హౌసింగ్ బోర్డు, రామ్‌నగర్, మైపాడు గేట్ తదితర ప్రాంతాలలో నివశిస్తున్నారు. పేరుకు కూలీ అధికంగా ఉంటున్నా ముఠాల పేరుతో మేస్త్రీలు కూలి సొమ్మును తగ్గించి ఇవ్వడం, మరో ప్రక్క పూరి పాకలు, గుడిసెలకు ఇంటి అద్దె పేరుతో 800 రూపాయల నుంచి 1000 రూపాయలు ముక్కుపిండి వసూలు చేసే యజమానుల మధ్య చాలీచాలని సంపాదనతో అరకొర వసతుల నడుమ బ్రతుకుతున్నారు శ్రీకాకుళం వాసులు. పదేళ్లకు పైగా ఉపాధి కోసం నగరానికి వచ్చి స్థిరపడిన కుటుంబాలు అనేకం ఉన్నాయి. రేషన్ కార్డుల సర్వేలో వీరి పేర్లు తొలగించారట. దీంతో కార్డులు వీరికి అందవు. ప్రభుత్వ పథకాలు దరిచేరవు. కూలీనాలీచేసి సంపాదించిన సొమ్ముతో ఇంటి అద్దె, కరెంటు బిల్లు కట్టుకొని జీవిస్తున్నామని ఎవ్వరూ రేషన్ కార్డుల గురించిగానీ, ప్రభుత్వ పథకాలు అందేలా చూడడంగానీ చేయరని వలస కుటుంబాలు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ఏమి ఉన్నా లేకున్నా వీరందరికీ ఎన్నికలప్పుడు ఓటు హక్కు ఉండడం విశేషం.

# ఆధునిక కవిత్వ సంకలనం చార్వాక!

నెల్లూరు సాహిత్య చరిత్రలో అరుదైన కవిని అభినందించి గౌరవించాలనే ఉద్దేశంతో అభ్యుదయ కవి రాచపాళెం రఘు సాహిత్య, సామాజిక కృషిని అభినందిస్తూ సృజన, సాహిత్య, సాంస్కృతిక వేదిక వెలువరించిన అభినందన సంచిక "ఆధునిక చార్వాక". ఇందులో కవి జీవితం, సామాజిక సేవ, ప్రముఖులు అతనికి అందించిన ప్రశంసలతోపాటు వివిధ అంశాలపై సాహిత్య, సామాజిక, కళారంగాల లోని ప్రముఖుల గురించి రఘు రాసిన పద్యాలున్నాయి. సులభశైలిలో రాసిన ఈ పద్యాలు పద్య సందేశాలను పాఠకుడికి సులభంగా చేరవేస్తాయి. కేవలం పద్యాలేకాదు. వాటితోబాటు ఫోటోలు ఇవ్వడం మంచి ప్రయోగం. ముఖ్యంగా కవి ప్రముఖులపైనే కాకుండా తన సమకాలీన కవులపై పద్యాలు రాయడం విశేషం. కవి జీవితాన్ని పరిచయం చేయడంలో అభినందన సంచిక లక్ష్యం నెరవేరినా ఇందులో ప్రశంసలతోపాటు కవి కవిత్వాన్ని, సాహిత్య వ్యక్తిత్వాన్ని విశ్లేషించే, ప్రతిబింబించే రచనలు చేర్చి ఉంటే బాగుండేది. అలాగే రచనలన్నింటినీ సంచికలో వరుస క్రమంలో ఉంచే విషయంలో, పేజీ - లేఅవుట్ రూపకల్పనలో శ్రద్ధ తీసుకొని ఉంటే సంచిక మరింత అందంగా ఉండేది. కవి రాచపాళెం రఘు జీవితంలోని వివిధ కోణాలను పాఠకులకు అందించడంలో అభినందన సంచిక సఫలం అయ్యింది. కవులు, రచయితలు స్వంత డబ్బుతోనో, చందాలతోనో తమ రచనలు అచ్చువేయించుకొని కొని చదివేవారు లేక ఉచితంగా పంపిణీ చేసుకొంటున్న ఈ రోజుల్లో సృజన సాహిత్య, సాంస్కృతిక వేదిక కవులకు అభినందన సంచికలు తేవాలనే సంకల్పం చేసుకోవడం హర్షదాయకం.

**ఆధునిక చార్వాక**
(కవి రాచపాళెం రఘు అభినందన సంచిక)

సంకలనం : **ఊరుబిండి వేంకటసుబ్రమణ్యశాస్త్రి**
సమీక్షకుడు : **డాక్టర్ ధనిశెట్టి లెనిన్**
వెల : **రూ.50/-**

**ప్రతులకు**
సృజన సాహిత్య, సాంస్కృతిక వేదిక
దగ్గుపాటి రాధాకృష్ణ, అధ్యక్షులు
సృజన, నెల్లూరు - 1

# విఆర్ కాలేజి దుర్గతి చూస్తే గుండె చెరువై పోతున్నది!

- వైఎంసిఎ భవనాన్ని భానుశ్రీకి బాడుగకు ఇస్తారట.
- హిందూ ధార్మిక సంస్థగా నమోదైన కాలేజీలో చర్చి ఎట్లా కడతారు?
- కోట్లాది రూపాయల ఫిక్స్‌డ్‌లు ఏమైనాయి.
- కాలేజీలో పిచ్చి చెట్లు మొలుస్తున్నాయి.
- హైస్కూల్ స్మశానం వలె వుంది.
- హెడ్మాస్టర్‌ను బేల్దారి మేస్త్రీగా మార్చారు.
- పాత విద్యార్థులు పూనుకొంటే తప్ప ఈ విద్యా సంస్థకు వూపిరి మిగలదు.




చిలుముపట్టిపోయిన విఆర్ కాలేజి బోర్డు.

చిన్ననాటి స్మృతులను నెమరు వేసుకోవడం మనిషన్న ప్రతివాడికీ ఒక మధురానుభూతి. గతించిపోయిన బాల్యం మళ్లీ వస్తే బాగుండునని కోరుకోని వాడుండడు. అది జరగదని తెలిసినా ఆ ఊహతోనే ఆనందం అనుభవించడం మానవ సహజ లక్షణం. చిన్ననాటి జ్ఞాపకాలకు మూలం పాఠశాల, కళాశాల జీవితం. ఆ ప్రాంగణాలలో, తరగతి గదులలో చేసిన అల్లరి, ఆడా మగా స్నేహితాలు, అయ్యవార్ల చేత చీవాట్లు, పరీక్షలలో పాట్లు వంటివన్నీ మధుర జ్ఞాపకాలే. అందువల్లనే ఎవరికైనా తాము చదివిన పాఠశాల, కళాశాల మీద తెలియని మానసిక అనుబంధం ఏర్పడి ఉంటుంది. ఆ విద్యాసంస్థలు ఉన్నతంగా నడవాలనీ, వృద్ధిలోకి రావాలనీ కోరికలుంటాయి. ఈ కోణం నుంచి చూసినప్పుడు నెల్లూరు విఆర్ కాలేజిలో చదివిన ప్రతి పాత విద్యార్థీ దురదృష్టవంతుడి క్రిందే లెక్క. సాధారణంగా పాత కాలంలో విఆర్ కాలేజిలో చదివిన ప్రతి ఒక్కరికీ ఒక విధమైన గౌరవం ఉంటుంది. గొప్ప కాలేజి విద్యార్థులమన్న అహంకారం ఉంటుంది. ఆ కాలేజి నిజంగానే గొప్పది. అక్కడ పని చేసిన లెక్చరర్లు, ప్రిన్సిపాళ్లు ఆదర్శప్రాయులు. చదువుల సరస్వతి వారి నాలుకల మీదనే నివసించేది. వారు చెప్పిన పాఠాలు జీవిత చరమాంకం వరకు గుర్తుండి పోతాయి. విఆర్ కాలేజిలో చదివిన వారిలో కొన్ని వేల మంది వివిధ రంగాలలో ఉన్నతికి వచ్చారు. ముఖ్యమంత్రులు, కేంద్రమంత్రులు అయ్యారు. ఐఎఎస్, ఐపిఎస్‌ల సంఖ్య లెక్కలేదు. రాకెట్ శాస్త్రవేత్తలు, సుప్రసిద్ధ ఇంజనీర్లు, ప్రపంచ ప్రఖ్యాత వైద్యులు, పేరెన్నికగన్న ప్రొఫెసర్లు, పారిశ్రామిక పరమపదసోపానమదిరోహించినవారు ఎందరో ఉన్నారు. వారందరినీ తలచుకొన్నప్పుడల్లా మనమూ ఆ కాలేజిలో చదివామన్న అనుభూతి చాలా తీపిగా ఉంటుంది.

కానీ ఇప్పుడు కాలేజి, హైస్కూళ్ల పరిస్థితి చూస్తే మన మీద మనకే జాలి కల్గడం ఖాయం. ఎవరికి పుట్టిన బిడ్డవురా వెక్కి వెక్కి ఏడ్చేవు అన్నట్లుంది వాటి పరిస్థితి. కాలేజిలో స్మశాన వాతావరణం. తరగతి గదులన్నీ ఖాళీ. ఒకప్పుడు వెంకటేశ్వర విశ్వవిద్యాలయం మొత్తంమీద ఉండే విద్యార్థులలో సగం భాగం విఆర్ కాలేజిలోనే ఉండే వారు. ఆరేడు వేల వరకు పెరిగింది ఆ సంఖ్య. కానీ ఇప్పుడక్కడ నాలుగైదు వందల మంది కూడా విద్యార్థులు లేరు. చేరడానికి వచ్చే వారిని కాలేజి సిబ్బందే నిరుత్సాహ పరుస్తున్నారు. ఇక్కడెందుకు చేరడం, పక్కనున్న ప్రైవేట్ కాలేజికి వెళ్లండని సిఫార్సు చేస్తున్నారు. అయ్యవార్ల సంఖ్య బాగా తగ్గిపోయింది. ఉన్న వారిలో ముప్పాతిక భాగం మంది కాలేజీకి రావడమే మానుకొన్నారు. వేరే వ్యాపారాలు చేసుకొంటూ, నెల నెలా జీతాలు మాత్రం తీసుకొంటున్నారు. రావూస్ కోచింగ్ సెంటర్ కోటేశ్వరరావు వంటి పెద్ద మనుషులు ఇంకొక అడుగు ముందుకేసి తమ బదులు నకిలీ అయ్యవార్లను పంపుతున్నారు. ఒక మహిళా లెక్చరర్ అయితే అమెరికాలో నివసిస్తూ ఇక్కడ జీతం తీసుకొంటున్నది.

విఆర్ హైస్కూల్‌లో ఒకప్పుడు ఆరు నుంచి పదవతరగతి వరకు ఒక్కొక్క తరగతికీ నాలుగు సెక్షన్లుండేవి. దాదాపు పదిహేను వందల మంది విద్యార్థులుండే వారు. కానీ ఇప్పుడు ఆరు తరగతులకు కలిపి విద్యార్థుల సంఖ్య కేవలం 240. క్లాస్ రూములన్నీ బోసిపోయి ఉన్నాయి. ఒక్కొక్క తరగతికి ఒక్కొక్క సెక్షన్ మించి నడపడం లేదు. స్కూల్ భవనాల మధ్య పిచ్చి చెట్లు మొలుస్తున్నాయి. లోపలకు అడుగు పెడితే అది పాఠశాలా లేక అడవా అన్నది అర్థం కావడం లేదు. టీచర్లు బడికి రావడం మానుకొన్నారు. రాలేదని అడిగేవారు లేరు. హెడ్‌మాస్టర్‌ను బేల్దారి మేస్త్రి వలె వాడుకొంటున్నాడు ఆనం వివేకానందరెడ్డి. వైఎంసిఎ గ్రౌండ్‌లో కడుతున్న భవనానికి పర్యవేక్షకుడు ఈ హెడ్‌మాస్టరే.

విఆర్ చిల్డ్రన్ అకాడమీ మూసిపారేశారు. అక్కడా వెయ్యి మంది పిల్లలు చదివేవారు. కాలేజిలోకి వస్తే మరింత దారుణం. ఎంబిఎ, ఎంసిఎ, పోస్ట్‌గ్రాడ్యుయేట్ కోర్సులకు సంబంధించిన విభాగాలన్నీ మూతపడి పోయాయి. మామూలు బిఎ, బికాం, బిఎస్‌సి తరగతులలో కూడా పిల్లలు లేరు. తరగతి గదులన్నీ పాచి పట్టి గోడల మధ్య పిచ్చి చెట్లు మొలచి స్మశానాన్ని తలపిస్తున్నది. విరిగిన బెంచీలు, కాళ్లులేని కుర్చీలతో జాలి గొల్పుతున్నది.

విఆర్ కాలేజి చుట్టూ అర డజనుకు పైగా ప్రైవేట్ డిగ్రీ, ఇంటర్మీడియట్ కాలేజీలు పుట్టుకొచ్చాయి. నిబంధనల ప్రకారం ఎయిడెడ్ కాలేజీలకు ఒక కిలో మీటర్ పరిధిలో మరొక కాలేజి పెట్టకూడదు. ఆ నిబంధన పట్టించుకోకుండా వదిలేసినందుకు ఆ ప్రైవేట్ కాలేజీల వారు ఏటా వివేకానందరెడ్డికి ముడుపులు చెల్లిస్తున్నారు. నారాయణ, రత్నం వంటి గుర్తింపులేని ప్రైవేట్ కాలేజీలు తమ విద్యార్థులను విఆర్ కాలేజ్ విద్యార్థులుగా చూపించి పరీక్షలు వ్రాయిస్తున్నాయి. అందుకు వివేకానందరెడ్డికి భారీ నజరానాలు అందుతున్నాయి.

ఇవన్నీ ఒక ఎత్తు, అసలు కాలేజీనే మూసి వేసి, తన అంతేవాసులకు లీజ్ ప్రాతిపదిక మీద ఇచ్చి వేయాలని వివేకానందరెడ్డి చేస్తున్న ప్రయత్నం మరొక ఎత్తు. విద్యార్థులను చేర్చుకోకుండా ఒక ప్రణాళిక ప్రకారం కాలేజ్‌ను పాడుపెట్టి, ఇక నడవదన్న పరిస్థితి కల్పించి, ప్రైవేట్ వ్యక్తులకు బాడుగకు ఇచ్చేయాలన్న కుట్ర బుద్ధితో ప్రవర్తిస్తున్నది యాజమాన్యం. లెక్చరర్లు తమంతట తాముగా ఇతర వ్యాపకాలకు మారిపోవడానికి, బదలీ చేయించుకొని పోవడానికి ప్రయత్నం చేస్తున్నారు. వారి జీతాల బిల్లుల మీద నెలల తరబడి సంతకాలు పెట్టకుండా ఇబ్బంది పెడుతున్నారు.

రాష్ట్రంలోనే అత్యంత ప్రసిద్ధమైన కళాశాలగా వెలుగొందిన విఆర్ కాలేజి ప్రస్తుత పరిస్థితి చూస్తే పాత విద్యార్థి అన్న ప్రతి ఒక్కడికీ కళ్లలో నీళ్లు తిరగడం ఖాయం.

ఇంతకంటే ఘోరం – కాలేజి విస్తరణ కోసం ఎసి సుబ్బారెడ్డి, మేనకూరు ఆదిశేషారెడ్డి ద్వయం ఎంతో దూరదృష్టితో సేకరించి పెట్టిన వైఎంసిఎ

కొరవ 14వ పేజీలో



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com